# నాట్యకళ

ఆంధ్రనాటక కళాపరిషత్పక్షమున ప్రచురింపబడు

సచిత్ర త్రైమాసిక పత్రిక

సంపాదకుడు

నీలంరాజు వెంకటశేషయ్య

సంపుటము 1

సంచిక 2

యువ చైత్రము

ఏప్రిలు 35

# విషయసూచిక

# రాజపోషకులు

శ్రీయుతులు సురభి గోవిందరావుగారు

# శాశ్వత చందాదారులు

శ్రీయుతులు డా. కె. శివరామయ్యగారు,

,, బందా కనకలింగేశ్వరరావుగారు,

వీరికి మా కృతజ్ఞతా పూర్వక వందనములు. ఇట్లే నాట్యాభిమానులెల్లరును రాజపోషకులుగాను, శాశ్వత చందాదారులుగను చేరి మా యుద్యమమును సఫలపరుపగోరుచున్నాము.

ఈ ప్రదర్శనము దీర్ఘసత్రముగా సాగెను. చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు పరీక్షకులలో నొకరు. వారే ధన్యులు. ఏలనఁగా వారికి కనులు లేవు.

మా కవి ఆనందదినములు. రాత్రిబరువంతయు పగలు పోయెడిది. పరీక్షకులగు వడ్డాది సుబ్బారాయఁడుగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహము గారును, హరినాగభూషణముగారును, నేనును ఒకచోటనే బస. నేతి సోమయాజులుగారు మమ్మంటుకొనియుండువారు. లక్ష్మీనరసింహముగా రొకహాస్యతరంగమును లేవఁదీసెడివారు. వడ్డాది సుబ్బారాయఁడుగారికి ఎన్నెన్ని గ్రంథములలో ఎన్నెన్ని పద్యములు వచ్చునో అంతుదొరికెడిదికాదు. నేనును వీరినడుమ ఆసులో కండెవలె ఆడుచుండెడివాఁడను. హరినాగభూషణముగారికి మాకంటె పాట యొకటి హెచ్చు. ఈ పగటినాటకములకు టిక్కెట్లులేకపోవుటవలన రాత్రి నాటకములకంటె వీనియందే జనసంఖ్య హెచ్చు.

ఈ పరీక్ష బెజవాడలో. అచట కొందఱు నటులమీఁద కొందఱ కసూయ. ఫలానావారిని మీరు ప్యాసుచేయించుచో మీ బుఱ్ఱ రామకీర్తన పాడింతునని ఆకాశవాణి పలికెను. నేను దానిని లెక్కచేయలేదు. నాది పదునెనిమిదేండ్ల ఉడుకుపాలు. మిగిలినవారందఱిది చల్లాఱినపాలు. వారాలోచించిరి. ఇంతలో ఆకాశవాణి ఆకాశధ్వనిగా మాఱెను. పెండాలురేకులమీఁద రాళ్లవాన కురియఁదొడఁగెను. మాలో పెద్దలు మంచిమాట చేసికొనుటకు సన్నాహములకుఁ గొంపోయిరి కాని లాభము లేకపోయెను. వోటింగు పెట్టి వా రప్పుడు నెత్తిమీఁది అపాయమును తొలఁగించిరి. నాట్యకళ అప్పు డిటులు అభివృద్ధి పొందెను.

దీనికి ఫలితముగా పదియేండ్లపాటు నాకనులకును, చెవులకును విశ్రాంతి కలిగెను.

పిదప

నే నొకనాఁడు రైలుప్రయాణము చేయవలసివచ్చెను. రైలులో ఎక్కడను చోటులేదు. దీనికి కారణము బెజవాడలో సావిత్రి! దాని కీజన ప్రవాహము.

నే నీనాటకము చూచుభాగ్యము బడయనైతిని. ఈ నాటకమున వేషము ధరించిన సంజీవరాయాదుల పే రాంధ్రలోక మెఱిఁగినదే.

తరువాత కొన్నియేండ్లకు స్థానం నరసింహారావుగారిని రంగస్థలమున హఠాత్తుగా చూచుట తటస్థించెను. అపుడు నాకనులు మూతలుపడలేదు.

కాని చెవులకు విశ్రాంతి కలిగెను. వెంటవెంటనే వీరివి మఱిరెండు వేషములు చూచితిని; మెచ్చితిని.

నా మిత్రులు కొందఱు పారుపల్లి సుబ్బారావుగారిని చూడు మనిరి. వారిమాట వింటిని. శాంతమును, గంభీరమును అగు వారివేషము నన్నాకర్షించెను. నాటకములు చూచుట నల్లమందువలె అలవాటులో పడఁజొచ్చెను.

ఇటులుండఁగా బళ్లారి రాఘవాచార్యులవారు బెజవాడకు వచ్చిరి. వీరిని నాలుగయిదురూపములలోఁ జూచితిని. ఆంధ్రనాటకసారస్వతమున ఒక అభావమును, ఒక శూన్యమును, ఒకలోపమును వీరు నాకనులకు చూపిరి.

గొప్పనటుఁడు ఉద్భవించెను. గొప్ప నాటకములు ఉద్భవింపలేదు.

దానివలన వీరిప్రదర్శనములలో కొన్నికొన్ని ఘట్టములు సినీమాలాయెను. అంకాంతములందు, లేక అటువంటివానియందు పాత్రము లేవో అనుభావముల నభినయించుచుండఁగా తెరపడును. దాన అనుభావము వ్యక్తమగును. అంగహారమువలన అనుభావవ్యక్తియేకాని కవితలో వ్యక్తి లేదు. అట్టియెడల రాఘవుఁడే యగుఁగాక యేమి చేయఁగలఁడు?

ఈ రాఘవునిమహిమచే రాలుగాపడియున్న పలువురహల్యలు రంగముమీఁద రూపము పడసిరి, పడయుచున్నారు, పడయఁగలరు. ఇటులు శాపవిమోచనమందిన మొదటినటిని నేను చూడలేదు కాని ఆమెను సబ్రహ్మచారిణి యగు పద్మావతీదేవిని మొన్న చెన్నపురిలోని వరివన్నాటకసందర్భమున 'తప్పెవరిది'లో చూచితిని. మగవారు వేసము వేయుటతప్పు అని ఈమె చెప్పక చెప్పెను (ఒక్క దాడిగోవిందరాజులవంటివారి మాట తప్ప).

ఉత్తర రంగము

౧౯౩౮ డిసెంబరు చివర చెన్నపురిలో నాట్యకళాపరిషత్తు ప్రారంభించిన దీర్ఘసత్త్రమున పలువురు నటులను చూడ తటస్థించెను. పద్మావతీరాఘవు లొకప్రహసనము ప్రదర్శించిరి. వారొనరించినది నాట్యముకాదు. అది నాట్యాభాసమును విమర్శించు ఆనందాత్మకమగు నాట్యకవితాకుల్య. ఈ రాఘవుని గుఱించి యిఁక వ్రాయను. ఈయన కలమునకును, కాకితమునకును మిగిలి యుండును.

పారుపల్లిసుబ్బారావుగారిలో శాంతి పక్వమాయెను. శ్రీరామమూర్తిలో గానవార్ధకములు పోటీచేసెను. తుంగల చలపతిరాయని గాన

మధురిమలో నాట్యకళయు కొంత తావు దొరకించుకొనఁ జూచుచున్నది. మాధవపెద్దిలో పెద్దతనము బలియుచున్నది. యుగంధరుని నేర్పు, మండపిభంగి, చాకిత అమాయికత, బోగముపిల్ల హొరంగు, దానిపేషీయన్న పైహంగు, మొదలగునవి కళాభిజ్ఞుల హృదయమున ముద్రితము లాయెను.

లబ్ధ ప్రతిష్ఠులగు వీరలమాట యిటుండ దాటి గోవిందరాజులుగారును, బందా కనకలింగేశ్వరరావుగారును, వసంతసేనయు, శ్రీరంజనీవసంతాదేవులును ఇఁకముందు నటులసంఖ్యను వృద్ధిచేయఁగలరని యనిపించిరి. గోవిందరాజులుగారి దిప్పటికే గొప్పస్థానము.

## జ్ఞానాభివృద్ధి

నటు లీరీతిగా నాట్యాభివృద్ధి చూపుటయే కాదు. కళాపరిజ్ఞానమునఁ గూడ ఆతిశేలుచున్నారు. వారు వారి ప్రదర్శనములందు అననుకూలము లయిన ఘట్టములను తెలిపిరి. పండితులతో చర్చించిరి. పద్యములు పనికిరావనిరి. స్వగతములు, అపవార్యలు కూడదనిరి. దీర్ఘోపన్యాసములు కోసిరి.

ఈ యభిప్రాయములు రాఘవాచార్యులవారు తెలిపినచో విశేషము లేదుకాని సారస్వత సంబంధ మంతగా లేని నటులు తెలుపుట విశేషము. నాట్యము వీరికి కొంతకొంత అనుభవమునకు వచ్చినకొలఁది దీనిపలన తెలియ నగుచున్నది.

పద్యములు తీసివేయవలయు ననియే వీరిలో పలువుర అభిప్రాయము. కాని పాటలు తీసివేయవలయు ననరు. ఏల? గానము లేనిచో ప్రేక్షకులలో పలువురు ప్రదర్శనము సాగనీయరు.

పది పండ్రెండేండ్లక్రింద ఏలూరులో ఒక ప్రదర్శనమున కేగితిని. బి. యే. ప్యాసుచేసిన ఒక సుప్రసిద్ధనటుఁడు శివాజీవేషము ధరించెను. ఆనటునకు పద్యమును, పాటయును లేదు. అల్లరి ఆరంభమాయెను. క్రమముగా దక్షాధ్వర ధ్వంసము జరిగెను. నేఁటికిని అదియే అవస్థ.

సంస్కృతనాటకముల కాలములో రాజుగాని, దైవముగాని సభాపతి. నాటకమున రసము ప్రధానము. నటుఁడు రసజ్ఞుఁడును, సహృదయుఁడును. సత్త్వము, భావన, రసకావ్యపఠనము కల సహృదయతయే టికెట్టు.

ఇపుడు డెమోక్రసీయే సభాపతి. నాటకమున రచనాసౌందర్యమే ప్రధానము. నటుఁడు ఆర్టు-పక్షపాతి. డబ్బుపెట్టి కొనఁదగినకాకితమే టిక్కెట్టు.

నాటక మేకకాలమున చూడఁదగినదియు, వినఁదగినదియు. ఇటులని కంటికిని, చెవికిని విసువు కలుగరాదు. కలిగినచో లోటే.

సుప్రసిద్ధములగు సంస్కృతనాటకములు మన చెవులలోనేగాని కంటి యెదుట లేవు. వానిలో కొన్ని నాటకములు కావ్యములే. మృచ్ఛకటికమున వర్షావర్ణనము కావ్యము. వేణీసంహారమున సుందరకుఁడు పౌరాణికుఁడు. కొన్ని నాటకములునాటకములూ వాక్ోవాక్యములు కలవు. ప్రదర్శనసౌభాగ్యము లేని అకాలమున ఇట్టి రచనలు నాటకములలో దూఱెనని తలఁపవలసియున్నది. కాలవిషయమునఁగూడ వారిలో కొందఱది దేవమానము. మృచ్ఛకటికమున పదవయంకము కొంతవఱ కభినయించుసరికి సూర్యోదయ మైనదఁట.* మాలతీ మాధవము డిటో.

విసువు కలిగించినను రసమునను పునఃపునర్దీప్తి కలిగించినను అకాలమున రూపకసామాన్యమునకు రసమువలననే చరితార్థత. ఆరసమునుబట్టియే వస్తువు. ఆవస్తువునుబట్టియే విభావాదులు. దానినిబట్టియే భాష. దానినిబట్టియే నటుఁడు, సహృదయుఁడు మొదలుగాఁగల పరంపర.

ఆర్టు

పాశ్చాత్యభాషల సంపర్కమువలన ముఖ్యముగా మన నటులును, బి. యేలును, యెమ్మేలును, రసమను మాటమఱచి ఆర్టు అనుమాటమీఁద ముగ్ధులగుచున్నారు. ఈపద మేభాషలో పుట్టెనో ఆభాషలో అది ఒకానొక కాలమున రచనామాత్రమునందును, పిదప సుందరమగు రచనమునందును, రాను రాను పందొమ్మిదవశతాబ్దిలో రసవిశిష్టమగు సుందరరచనమునందును ప్రయుక్త మగుచు వచ్చెను. సుందరమగు రచనము అను అర్థమే గ్రహించి చాలమంది నటులు ఈఆర్టుపదము నుపయోగించుచున్నారు. వారు దీనికి రసమును జోడింపరు.

ఇట్టి వీరు రసవంతములయినను పద్యములను నిషేధింతురు. ఏల ? చాల రసవత్పద్యములలో నటుఁడు చూపఁదగు నాట్యము (ఆర్టు) ఉండదు. పద్యము లను స్ఫుటముగా చదువుటయే అపుడు నటునిపని. రసింపనేరని నటుఁడుగాని, సహృదయతలేని నటుఁడుగాని పద్యమును నిషేధించును. అనఁగా నటునకు

---

* యత్ సూర్యోదయభయతః కవినోచితపాత్రమేలనం న కృతమ్, సుందరయుక్తిభి రరచయ దాచందనోక్తి సీలకంఠ (స్య) ? (స్) తత్.

చూ. పండిత మాలరాజశర్మశాస్త్రి యం. ఎ. గారి ఆంగ్లటిప్పణి.

రసమువిూఁదకంటె రచనమిూఁద, అర్థమిూఁద కన్ను. నాటకములు దృశ్యములును, శ్రవ్యములును అనుమాట వీరు మఱచుచున్నారు. నాటకములలో ఇట్టి రసవత్పద్యభాగములే కొన్ని శ్రవ్యములు.

సాంఘిక నాటకములు

నటులకును, కొంతమంది ప్రేక్షకులకును రసదృష్టి సన్నగిల్లి అర్థదృష్టి ఎపుడు బలిసెనో అపుడే సాంఘిక రాజకీయ ధార్మికాది నాటకముల అక్కఱ కలిగెను. ఈనాటకములు గద్యబహుళములుగా నుండవలయు ననుట నిర్వివాదము.

ఇట నొకసంగతి చెప్పవలసియున్నది. మొన్నజరిగిన పరిషత్సభలలో పలువురు పండితులును, కవులును సాంఘికనాటకము లనఁగనే మూతివిఱిచిరి; వ్యావహారికభాషయెడలను, స్వగతాదులుండరాదనువెడలను మాటికిమాటికి తమ అసమ్మతిని దెలిపిరి.

వీరు కన్యాశుల్కము, తప్పెవరిది, టుడేలను చూచినవారే.

వీరు చెప్పు ముఖ్యాపత్తు లివి: పౌరాణిక నాటకములకు వచ్చినట్లు లీనాటకములకు జనులురారు. వీనిలో వస్తుగౌరవములేదు. ఉన్నచో కొలఁది. దానినిబట్టి వీని ఆయుర్దాయము తక్కువ. గానమును భాషాగానమును ఉండవు. కన్యాశుల్క మస్తమించెను. రాఘవాచార్యులుగారు లేనిచో 'తప్పెవరిది'కి పోవుట తప్పు. టుడే మెఱుగుపురువు.

వీరిమాటలలో కొంతసత్యము లేకపోలేదు. కాని సాంఘికనాటకములు అపరిహార్యములు. సంస్కృతవాఙ్మయమున మహాకవులురచించిన ఉత్పాద్యములు కలవు. వస్తుగౌరవములేని నాటకములును కలవు. వ్యావహారికభాషలో వ్రాయఁబడిన కర్పూరమంజరి వగైరాలు కలవు. ఇవన్నియు రసాత్మకములని గుఱుతుంచుకొనవలెను.

వీనివలె సాంఘికనాటకములుగూడ రసాత్మకము లయినచో హాని యుండదు. వస్తుగౌరవము తగ్గుఁగాక, ఆయుఃపరిమితి పరిమిత మగుఁగాక, సంఘశ్రేయోఽభిలాషతో రచింపఁబడిన రసాత్మకమగు ఏసాంఘికనాటకమయినను ఉపాదేయమే యగును.

సాంఘికనాటకములకు ఆయువు తక్కువయే. సహగమనము రామమోహనుని అమరప్రయత్నముచే మృతమైపోయెను. ఈయాచారమునుగుఱించి

ఆకాలమున ఒక సాంఘికనాటకము రచింపఁబడె ననుకొందము. ఆయాచారము స్తమింపఁగనే ఆనాటకముగూడ అస్తమించును. కాని అది రసాత్మకమయినచో అంత సులభముగా అస్తమింపదు.

'నాటకము చూడఁదగినదేకాని వినఁదగినది కా'దని అతివాదులందురు. అయితే మనము నాటకమునకుఁబోయి చూడవలయునది మూకాభినయమా? కాదు, ఎంతమాత్రమును కాదు. మనకు వినఁబడు శబ్దజాలము అర్థమునకును, నాట్యమునకును ఇసుమంతయు నాతంకము చేయరాదు. ఎవరయినను నాటకము చూచివచ్చితిమందురు గాని వినివచ్చితి మనరు. కావున కవి శ్రవ్యభాగమును దృశ్యములోనికి కరుగఁబోయవలెను.

ఆలంకారికులు శృంగారరసమునెడల నీమాటలేయనిరి. కరుణరసమునకు అద్దమువలె స్వచ్ఛమగు భాష వాడమనిరి.

ఇచట నొకటి గమనింపవలయును. పడమటిదేశములలో ప్రేక్షకులలో నిరక్షరు లుండరు. మనదేశమున ఉందురు. కావున ప్రకృతసాంఘికనాటకములు వ్యావహారికభాషలో నుండవలయునసుట తేటతెల్లము. కాఁగా రసప్రతిబంధకత లేనంతవాస్తవముగాఁగూడ నుండవలయు ననుట అర్థసిద్ధము.

ఆలంకారికులు కావ్యము సలుఁదెఱఁగు లనిరి. అందు అస్ఫుటమగు వ్యంగ్యముతో వాచ్య చమత్కారము కలదానికిని మూఁడవస్థానము కలదు. దాన సుందరమగు ఆర్టు కలదని మన మనవచ్చును. ఇట్టి నాటకములు ఇబ్సెన్, షా మొదలగువారు పెక్కులు రచించిరి. ఇఁక సాంఘికవిషయములను గ్రహించి కవులు వానిని రసాత్మకములనుగా చేయఁగలిగినచో వివాదమేడ? దానివలన ప్రకృతము నాట్యకళ కొక కళ హెచ్చును. సంఘమునకు ఒకమేలు చేకూరును. అట్టినాటకములకు నటులును, సహృదయులును ఎదురుచూతురు.

# సారంగధర 'శకలము'

## వేదము వేంకటరాయశాస్త్రి

[అస్మత్పితామహులు శ్రీ 'కళాప్రపూర్ణ' వేదము వేంకటరాయశాస్త్రులవారు తాము జీవితదశలో చేసిన వాఙ్మయసేవకన్న పెక్కుమడుఁగులు చేయ సంకల్పించియు జీవితములోఁ గలిగిన ఒడుదొడుకులచే అందు కొంతమాత్రమే చేయఁగల్గిరనుట ఎల్లవారికిని తెలిసియేయున్నది. అట్లే పదునైదు స్వతంత్రనాటకములను వ్రాయ సంకల్పించుకొని యుండిరి. వానిలో సారంగధర నాటకమును సంపూర్ణవిషాదాంతముగా, చిత్రాంగి విషముత్రాగుట, సారంగుఁడు తల్లిదండ్రులయొడిలో మృతిజెందుట, అతనిని అగ్నిసాత్కరించి రాజును, రత్నాంగియు అనలప్రవేశమొనర్చుట లోనగు సన్నివేశములతోను, ప్రతాపరుద్రీయమందు విద్యానాథునింబోలె నన్నయ నారాయణ భట్టులను ఇందు నెక్కొల్పి పదియంకములలో నాత్మనాటకనిర్మాణ చాతురి కవధిగా వ్రాయ సంకల్పించి యుండిరి. కాని అట్లుజరుగలేదు. విధి విపరీతముగదా!

మా తాతగారిట్లు రచియింప సంకల్పించిన సారంగధర నాటకమున నొక శకలము, వారే వ్రాసినది, ప్రాంతకాగితములలో కనుపించినది. అది యానాటకమున కాయువుపట్టయిన చిత్రాంగిపలవంతను తెలుపు రసవంతమగు నొక 'దృశ్యము.'

దీని యునికిని నేను ప్రసంగవశమున చెప్పఁగా "నాట్యకళ" సంపాదకులు శ్రీ నీలంరాజు వేంకటశేషయ్యగారు విని తమ పత్రికలో దీనిని ప్రకటింపవలసినదిగా నన్నుం గోరిరి. వారి కోరికమెయి దీని నీ "నాట్యకళ"మూలముననే ఆంధ్రలోకమున కందఁజేయు చున్నాఁడను.

—వేదము వేంకటరాయఁ]

చిత్రాంగి:—ఓసే భామతీ, నే నిట్లు కుమిలిపోవలసినదే?

భామతి:—కలువ వెన్నెలకు, కమలము ఎండకు వాడెనందువు. నీ కేమి లోపము? మగఁ డాంధ్రనాథుఁడు, నిన్నుగన్న కంటితో వేఱొకతెం గననొల్లఁడు. మీరు పువ్వుందావియుంబోలె, మణియుం దేజమువోలె ఏకమైయున్నారు. నీభాగ్యము ఇంద్రాణికైన లేదు. పతి నిన్ను క్షణమయినం బాయఁడు.

చిత్రాంగి:—కంఠమున కాలపాశమువలె తగుల్కొన్నాఁడు.

భామతి:—క్షణక్షణము నీమీఁది ప్రేమ హెచ్చుచున్నది.

చిత్రాంగి:—ఉరి బిగిసికొనుచున్నది. నాగతి యీముదుకని తెలిమీసాలకు సంపెంగనూనెపూయుట యైనది. నాకు పటములో ఆమోహనమూర్తిం

జూపుటయేమి, యీవల్లకాటికొ ర్రికి నన్ను కట్టుటయేమి? ఈయన సాధువు, నేను సాధ్వినిగాను. దైవమున్నాఁడా! బలవంతునిదే ధర్మము, అబలది యేమయిన నధర్మమే. ముదుకని ముద్దుబానిసను, నా కేల యీభాగ్యము! తప్పించుకొని పోదునా, సాయపడుదువా?

భామతి:—నిన్నుం గొలుపనేని నేనేల? అయినను విను, నీదొరదయచేత నీవు పట్టినదెల్ల బంగారము, తలఁచినదెల్ల సిద్ధము.

చిత్రాంగి:—బ్రదికినదెల్ల మృతి, ఆరగించినదెల్ల విషము. ఏల ప్రసంగము చేసెదవు? మెడకు రాయిగట్టి అగడ్తలోనైన త్రోయుము, లేదా ఆ పటములోని యీ నామనోనాయకుని సారంగధరుని తేనైన నందెమ్ము. ఈరెండునెలలు నొకయుగముగాఁ గడపితిని. ఈయంతిపురిఖైదు తల్లి కడుపులోవాసముకన్న ఘోరము. నిన్ను నమ్ముకొని ప్రాణములను బిగఁబట్టుకొనియున్నాను.

భామతి:—అయ్యో! రెండిండ్లకును, రెండులోకములకుకాని యీబుద్ధి నీకేల పుట్టినదమ్మా! నీబుద్ధి యిట్లగునని నేను తలఁపనైతిని. నీమాటల నమ్మలేకున్నాను. నన్ను కంగించెదవా. రాజాంగనవే, రాజాధిరాజ భార్యవే.

చిత్రాంగి:—ఏమి నవరస వేదాంతమారంభించితివి. వెంటనే రెంటనొకటి తెమ్ము, అవిషమూలికనైనయునేని, విషమునేని.

భామతి:—కూడదమ్మా అంతఃపురములందు ఇట్టిపనులకు చిత్రవధ లగునో ఎఱుఁగవు. నోరుగానిన్నను అపాయము కలుగును. నామాట విని కుదురుగానుండి నీ త్తిపోదుము.

చిత్రాంగి:—ఈబ్రతుకుకన్న ఆచిత్రవధయే మేలు. నాయాన చేసెదవాలేదా?

భామతి:—నేను చేయను, చేయఁజాలను. నీకొలువు మాని ఎటకేని పోయెదను.

చిత్రాంగి:—[స్వగతము] దీనికి నాపై ప్రాణము. కాని ఇది రాచది, కుల గర్వమునకలది. అబాల్యము నాతో పెరిగినదయినను నాకు ఈవిషయమున తోడ్పడదు. దీని పోనీఁగూడదు. పోనిచ్చిన బయటికి ఈవృత్తాంతమును చెప్పును. కానీ [ప్రకాశము] ఓసీ, నాకు నీవు కూడపెరిగిన ప్రాణప్రియురాలని నిట్టు చెప్పుకొన్నందులకు మొట్టసాగితివి. కానీ, ఇందుకైనె నిన్నుఁగూడ కోల్పోవలయునా? నాకు నీవే శరణమని

తలంపకు. నీచేతఁగానియెడల నాప్రజ్ఞచేత సాధింపలేనా. నీవే నన్ను కడతేర్తువని నమ్మికొనియుంటిని. స్నేహపాశములవలన మోసపోయితిని.

భామతి:—మోసమనవలదు. ఈవృత్తాంతము నాతో చెప్పుట బావిలో వైచుటయేయని నమ్ముము.

చిత్రాంగి:—చాలు. నీపని చూచుకో.

భామతి:—నీయాజ్ఞ [స్వగతము] ఏపుట్టలో ఏపామో! ఏకాలానికి ఏయుత్పాతమో! (అని నిష్క్రమించును.)

చిత్రాంగి:—ఇందిరా!

[అంతట ఇందిరయనుచేటి ప్రవేశించును.]

ఇందిర:—ఏమి అమ్మగారియాజ్ఞ?

చిత్రాంగి:—నీవు మాదయవలన గొప్పకొరకు రాశివి కాఁగోరెదవా లేదా?

ఇందిర:—మీదయవలన తప్పక అయ్యెదను.

చిత్రాంగి:—అటైన నీతెలివిని మాకై ఏపాటి వినియోగించితివి?

ఇందిర:—నేను ముందే తెలుసుకొని చెప్పితినిగదా ఆయనకు పావురమువేఁట ఇష్టమని. అతని పావురము మగది. ఆతని పావురాన్ని లాగడానికి మనకు ఆఁడుపావురాన్ని తెచ్చినాను. మనపావురంరెక్కలలో విప్పినప్పుడు కనఁబడేలాగ, అతని పావురముమీఁద అతనిపేరున్నట్టే అమ్మగారిపేరు చిత్రించినానుగదా. ఇప్పుడు ఆయన ఆవేఁటమీఁద ఈవీధిని ఎల్లుండిమధ్యాహ్నము వచ్చునని తెలుసుకొంటిని. అప్పటికి అమ్మగారు సిద్ధపడవలెను.

చిత్రాంగి:—నీవు ఆసమయమున మిట్టనాడు నాతని పావురమును మనపావురముచేత నాకర్షింపవలయును.

ఇందిర:—అంతా ఆలాగే చేస్తాను. ఆపైని అదృష్టము.

చిత్రాంగి:—సరి, ఇంచుకసేపు సంగీతశాలలో వినోదించెదము.

ఇందిర:—ఇటుఇటు అమ్మగారు.

[అందఱు నిష్క్రమింతురు.]

# నాటక ప్రయోజనము విలాసమా, విజ్ఞానమా?

శ్రీ విశ్వనాథ కవిరాజు

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే'

—కావ్యప్రకాశము

మా పరిషద్గోష్ఠిలో ఏ నాటకముయొక్కగాని గుణాగుణప్రసంగము వచ్చేటప్పుడు ఏమూలనుండిమో 'దీని ప్రయోజన మేమిటి?' అనే ప్రశ్న వస్తూవుంటుంది. వెనువెంటనే దానికి జవాబుగా 'ప్రయోజన మేమిటి? రామారావుగారి చిత్రములకూ, ఉదయశంకరుని నృత్యమునకూ, నాయుడుగారి ఫిడేలువాద్యమునకూ ఫలమేమో దీనికీ అదే—ఆనందము'అని వినబడుతుంది. దానికి ప్రత్యాఖ్యానంగా ఇంకొకధ్వని "అట్లా అనడానికి వీలులేదు. కావ్యం వీటి అన్నిటికంటే విశిష్టమైనది. దీనికి కేవలానందముకంటె భిన్నమైన ప్రయోజన ముండితీరవలె" అని బయలువెడలుతుంది. తుదకు పరిషదభిప్రాయము రెండుగా తేలుతూవుంటుంది. "ఇది ఆద్యంతమూ సంతోషావహంగా వుండడంవల్ల చాలా ఉత్తమగ్రంథము" అని ఒకటీ— "దీని కింకొకప్రయోజనమేమీ కానరానందువల్లనూ, దీనిమూలమున దేశమునకుగాని, సంఘమునకుగాని యేవిధమైన లాభమునూ కన్పట్టకపోవుటచేతనూ ఇది అంతగా ప్రశంసింపరానిది" అని ఒకటీ. ఎవరిఅభిప్రాయము వారిదేకాని పర్యవసానంలేదు. అయితే నాటకప్రయోజన మేమో నిర్ధారణగా తేల్చవలెనని మేమందరమూ మాఆచార్యులవారిని కోరినాము. వారీసందర్భమున ఒకవ్యాసమువ్రాసి తెచ్చి చదివినారు. వారు చదువుతూవుండగా నడుమనడుమ ఎవరికితోచిన ప్రశ్నలు వా రడుగుతూవచ్చినారు. సమాధానములు సంతృప్తికరముగానుండెను. ఈవ్యాసచర్చ పూర్తిఅయేసరికి నాల్గుగంటలకాలం పట్టింది. కనుక ఆచర్చఅంతా ఎత్తివ్రాయకుండా ఆవ్యాసంమాత్రం తమ కందచేస్తూవున్నాను. వ్యాసం గ్రాంథికభాషలో వున్నది—భాష యేదైతే మనకేమి?

## వ్యాసం

'కావ్యం ద్వివిధమ్—దృశ్యం శ్రవ్యంచేతి' అనువచనమున నాటకము కావ్యభేదము. దృశ్యమును తొలుత వాకొనుటచే నాటకమునకే అభ్యర్హితత్వము. కావునసే 'కావ్యేషు నాటకం రమ్యమ్' అనియు, 'నాటకాంతం కవిత్వమ్' అనియు, 'నాటకాంతంహి సాహిత్యమ్' అనియు పెద్ద లాడుదురు. వేదములకు, వేదాంతములకు (ఉపనిషత్తులకు)గల సంబంధమే కావ్యనాటకములకును గలదు.

భరతాచార్యులవారు ప్రవచించినట్లు

'నతత్ శ్రుతం నతత్ శిల్పం నసా విద్యా నసా కళా
నాసౌ యోగో నతత్ కర్మ యన్నాట్యేఽస్మిన్నదృశ్యతే.'

(శ్రుతము, శిల్పము, విద్య, కళ, యోగము, కర్మ సమస్తమును సమస్తభేదములతో నాటకమున ప్రదర్శింపబడును.)

'ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధివివర్ధనమ్'

అనుటచే నిది లోకారాధ్యమనుటయు సునిశ్చితము. ఈయర్థమునే ఆంగ్లకవిశేఖరుడగు షెల్లీ (Shelly) సుగమముగ— 'The connection of poetry and social good is more observable in the drama than in any other form; and it is indisputable that the highest perfection of human society has ever corresponded with the highest dramatic excellence, and that the corruption or extinction of the drama in a nation where it has once flourished marks a corruption of manners and an extinction of energies which sustain the soul of social life; for the end of social corruption is to destroy all sensibility to pleasure' అని వివరించియున్నాడు.

ఒకానొక జాతిప్రాశస్త్యము తజ్జాతిని ప్రకాశించు నాటకకళ నానుకొనియుండునని ప్రాజ్ఞులు తలంతురే, అట్టి యమూల్యపదార్థము నెట్లుపయోగించుకొనవలయును అను ప్రశ్న సామాన్యముగ నెల్లరకు పొడకట్టుచుండును.

'సద్యః పరనిర్వృతయే' అనుటచేతను, 'కావ్యేషు నాటకం రమ్యమ్' అనుటచేతను నాటకముఖ్యప్రయోజనము ప్రీతియేయని తరచుగ తలంతురు. పాశ్చాత్యపండితులలో అనేకులుకూడ కవిత్వమునకును తక్కినకళలకును ముఖ్యప్రయోజనము హృదయజన్య రసాస్వాదలక్షణమగు నానందమే అని నుడివియున్నారు.

"And they shall be accounted poet-kings
Who simply tell the most heart-easing things"

—*Keats*

"If you get simple beauty and naught else,
You get about the best thing God invents."

—*Fra Lippo Lippi*

"I wish to state my firm belief that poetry should not try to teach, that it should exist simply because it is created beauty."

—*Amy Lowel*

"Lying, the telling of beautiful untrue things, is the proper aim of art"

—*Oscar Wilde*

"A poem is that species of composition which is opposed to works of science, by proposing for its immediate object pleasure not truth"

—*Coleridge*

సంస్కృత నాటకకర్తల యభిప్రాయమును ముఖ్యముగ పై యర్థమునే బలపఱచునట్లు పొడకట్టును—

'అపినామ స్వయమేవ కవితాకోవిదాః పారిషదాః, అన్యసూక్తిభి ర్వినోదయిష్యంతే.'

'అపి ముదముపయాంతో వాగ్విలాసైః స్వకీయైః
పరభణితిషు తోషం యాంతి సంతః కియంతః.'

స్వప్న రాఘవము

'యద్యేవ ముద్రామశబ్దార్థ సన్నివేశ శిల్పాకల్పేన—
కేనాపి రూపకేణ వినోదనీయా వయమితి'

—మల్లికామారుతము

'రసాస్వాదేన తరలా యే మాద్యంతి విపశ్చితః,
తఏవ భావుకా లోకే భవంతి హ్యాపయాలవః'

-ప్రతాపరుద్ర కల్యాణము

'ప్రీతిర్నామ సదస్యానాం ప్రియా రంగోపజీవినః'

-అనర్ఘ రాఘవము

శేషకృష్ణ విద్వత్కవియు తన కంసవధనాటకమున—

'తద్యావ దేతాం నిజవిజ్ఞానోపహారేణోపదిష్టే' అని విజ్ఞానపక్షపాతము జూపగా సామాజికులు (audience) వినోదమునే వాంఛించిరి, 'దూరాధ్వ సంచార పరిశ్రాంత స్వాంతాన్ అస్మాన్ కేనచి దభినవగ్రథితవస్తునా ప్రయోగేణ భగవత్కృపానుబంధినా వినోదయ' అని. కళలను, ముఖ్యముగ నాట్యమును కేవలముగ ప్రీతికొఱకే యుద్దేశించిన పాశ్చాత్య పండితులేమి, భారతీయ విద్వాంసులేమి— 'ఈశ్వరాణాం విలాసశ్చ' అనునట్లు సంపూర్ణ సంపదలతో తులతూగుచున్న తత్తత్కాలములననుసరించి యట్లు ప్రవచించిరి. దేశము సుభిక్షమై మతసాంఘిక రాజకీయాందోళన లెవ్వియు లేని కాలమున పండువగా నొకానొకప్పుడు నాటకము లాడుకొనుచుండుట గలదు.

విజయలక్ష్మీవిరాజితుడై శ్రీ మహీపాలదేవుడు చండకౌశికము నాడించెను. దిగ్విజయానంతరము కుమారునికి పట్టముగట్టి గోపాలవర్మ మహారాజు శాంతరసప్రధానమగు ప్రబోధచంద్రోదయము నాడించెను. అట్లే శ్రీ యువరాజదేవుడు విద్ధసాలభంజికను, మహేంద్రపాలదేవుడు బాలరామాయణమును, శ్రీ నిర్భయ నరేంద్రనందనుడు బాలభారతమును, ప్రతాపరుద్ర గజపతి చైతన్య చంద్రోదయమును, మహారాజ గోవర్ధనధారి కంసవధను ప్రయోగింపజేసినట్లు కలదు. శ్రీహర్ష మహాకవి చెప్పినట్లు—

'రాజ్యం నిర్జితశత్రు యోగ్యసచివే న్యస్త స్సమస్తో భరః
సమ్యగ్లాలితపాలితాః ప్రశమితాశేషోపసర్గాః ప్రజాః,
ప్రద్యోతస్య సుతా వసంతసమయ స్త్వంచేతి నామ్నా ధృతిం
కామః కామ ముపైత్వయం మమపున ర్మన్యే మహా నుత్సవః.'

అను నకలుషిత సుఖమయావస్థలో నట్టి విలాసప్రధానములగు నాటకములే యొప్పియుండును.

కాని యిప్పుడన్ననో జాతీయనైతిక సాంఘిక రాజకీయ సంఘర్షణముల నుడిబడిన యాకువలె ప్రతిమానవుడు విరతిలేక సంక్షోభించుచుండ, అంతులేని బానిసతనమున నెంతవానికి బ్రదుకుటయే దుర్ఘటమగుచుండ, అగ్నిపర్వతము భేదిల్లినట్లు ఒక్కొకధర్మము బ్రద్దలుగా నాయాపదనుండి తప్పికొన దేశమంతయు తనశక్తిని ధారపోయవలసియుండ విలాసముమాట స్మరింపనైన నవకాశ మున్నదా! చేతినిండుగా పనిగలవాడు సంగీతము నానందించుచు గూర్చుండ జాలడు గదా? కాబోవువానికి కావ్యముకంటె కార్యము ప్రధానమగును. ప్లేటో (Plato) సుధీమణి తన రిపబ్లిక్ (Republic) అను మహాగ్రంథమున కావ్యనాటకాదులదెస నిట్లనాదరణ జూపియున్నాడు:

"Let us assure our sweet friend (Poetry) and the sister arts of imitation (drama etc.,) that if she will only prove her title to exist in a well-ordered state, we shall be delighted to receive her . . we are very conscious of her charms, but we may not on that account betray the truth, . . . Shall I propose, then, that she be allowed to return from exile, but on this condition only, that she makes a defence of her-self . . . Let then (the lovers of art and poetry) show not only that she is pleasant but also useful to states and to human life we will listen in a kindly spirit."

ప్లేటోసుధీమణియభిప్రాయమును మన్నించి కొందరు పండితులు కళల యందు విలాసమును, విజ్ఞానమును (fancy and wisdom) కూడ పొడకట్ట

వలయునని నిశ్చయించిరి. పూర్వవాదమునకు చెందినవారికంటె నీవాదమును సమాదరించుచున్నవారు పాశ్చాత్యదేశములలో విమర్శకులలోను, రచయితల లోనుకూడ చాలమంది గలరు.

"A marsh, where only flat leaves lie,
And showing but the broken sky
Too surely is the sweetest lay
That wins the ear and wastes the day
Where youthful fancy pouts alone
And lets not Wisdom touch her zone."

—*Landor*

"Poesy therefore is an art of imitation,
. . . with this end, to teach and delight."

—*Sir P. Sidney*

'But I speak to this purpose, that all the end of the comical part be not upon such scornful matters, as stirreth laughter only; but mixed with it, that delightful teaching which is the end of poesy.'

—*W. Webbe*

"I am confident whoever writes a tragedy, cannot please but must also profit."

—*T. Rymer*

ఇట్లే బుద్ధిమంతులనేకులు కావ్యనాటకములకు ప్రీతితోపాటు సదుప దేశమును ప్రధానమని నిశ్చయించియున్నారు—

'ధర్మ్య మర్థ్యం యశస్యంచ సోపదేశం ససంగ్రహమ్,
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శనమ్' అనియు,
'సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్,
లోకోపదేశజననం నాట్యమేత ద్భవిష్యతి' అనియు,
'ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్,
హితోపదేశజననం నాట్యమేత ద్భవిష్యతి.' అనియు,
'వేదవిద్యేతిహాసానా మర్థానాం పరికల్పనమ్' అనియు,
'వేదోపవేదై స్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా' అనియు
'శ్రుతిస్మృతి సదాచార పరిశేషార్థ కల్పనమ్' అనియు,
'అబోధానాం విబోధశ్చ' అనియు, 'సర్వోపజీవినా మర్థః' అనియు.

భరతాచార్యులు వేయిసందర్భములలో వేయిసారులు నొక్కి నొక్కి యాదే శించుటచే నాటకమున కుపదేశమే ప్రధానమని విశ్వసింపవలయును.

నాట్యవేదము సృష్టింపబడినవెనుక తొలుదొల్త భరతాచార్యులు తన కుమారులతోను, శిష్యులతోను గలిసి నాందియొనర్చి తదంతమున దేవతలు రాక్షసులగెల్చిన యుదంతము నాటకముగ నాడెను. తర్వాత నాట్యమందిరము నిర్మించుకొని పరమేష్ఠియాజ్ఞచే 'అమృతమంథనము' అనునాటక మాడెను. అమృతమంథనమున దేవతలకు నష్టవస్తుపునర్లబ్ధి చేకూరినది; శత్రువిజయము ఘటిల్లినది; అమర్త్యత్వము లభించినది. కావుననే యిది 'ఉత్సాహజననమును, సర్వప్రీతికరము'నైనది. ఆవెనుక బ్రహ్మ వీరనెల్లర గొనిపోయి హిమవంతమున మహేశ్వరునియెదుట 'త్రిపురదాహ'మను డిమమును ప్రదర్శింపజేసెను. మహేశ్వరునియెదుట ప్రదర్శింపవలసినది తత్పరాక్రమమును ప్రకటించు త్రిపురదాహమే. ఇవి నాటివారి పరిస్థితుల కనుకూలములైన చక్కని సరిక్రొత్తకథావిశేషములు.

మనదేశమున జ్ఞానప్రచారమునకే నాట్యకళ ప్రభవించినది. భరతాచార్యులు నాట్యోత్పత్తికి హేతువు నిట్లు చెప్పుచున్నారు:

'గ్రామ్యధర్మే ప్రవృత్తేతు కామలోభవశంగతే,
ఈర్ష్యాక్రోధాదిసమ్మూఢే లోకే సుఖితదుఃఖితే.
మహేంద్రప్రముఖై ర్దేవై రుక్తఃకిల పితామహః,
క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్.
నవేదవ్యవహారోఽయం సంశ్రావ్యః శూద్రజాతిషు,
తస్మాత్ సృజాపరం వేదం పంచమం సార్వవర్ణికమ్.'

లోకమున గ్రామ్యధర్మము ప్రబలగా మరల సనాతనధర్మమును ప్రతిష్ఠింపగోరి మహేంద్రుడు పరమేష్ఠిని ప్రార్థించెను. అతడును కామలోభ వశంగతమును, ఈర్ష్యాక్రోధాది సమ్మూఢము నగు లోకము నుద్ధరింపదలచి, విద్యాగంధములేని శూద్రజాతులకుగూడ ప్రబోధము కల్గింపదలచి సార్వవర్ణికముగా నుండునట్లు

'జగ్రాహ పాఠ్యం ఋగ్వేదాత్ సామభ్యో గీతమేవచ,
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి'

చతుర్వేదసారంబుగ నాట్యకళను సృష్టించెను.

నాటివలెనే నేడును దేశ మజ్ఞానహతమైనది. విద్యాహీనులకంటె విద్యాధికులమనుకొనువారే కుక్షింభరులై గుణహీనులు, పాపకర్ములు నైయున్నారు. ఇప్పుడు దేశమున నొసంగబడుచున్న విద్య విద్యకాదనియు, దీనికి



చతుర్థాంధ్ర నాటకకళాపరిషత్తు, ఆహ్వాన సంఘము



చతుర్థాంధ్ర నాటకకళాపరిషత్తు, నట బృందము

నైహికాముష్మికఫలంబులు రెండును లేవనియు ననేకుల తలంపు. విద్యవలన గాక దేశ ముద్ధరింపబడదనుట నిశ్చయము. దేశమున స్త్రీపురుష బాలాబాల గోపాలమును విద్యావివేకసంపన్నులు కావలెనని లోకము కోరుచున్నది; వారును గోరుచున్నారు. నాగరకతలో తక్కినదేశములకు కొన్నివేలమైళ్లు వెనుకబడియున్న మనము అపరిమితజవమ్మున వారి నందుకొని యతిక్రమింప వలసియుండుటచే విద్యాప్రచారమును, విజ్ఞానాభివృద్ధియు ప్రతిభారతీయునకు నిపుడు ప్రధానకర్తవ్యమై యున్నది. కావున—

నాటకకళను మనప్రయత్నములు సఫలమొనర్చుకొనుటలో సాధనముగానైన చేసుకొనవలెను; లేదా మనప్రయత్నములు సఫలమగువరకు వదలుకొనైన వదలుకోవలెను. ఓమ్, తత్ సత్.

వ్యాసము పూర్తిఅయింది. సీతాఫలపుపండునిండా గింజలులాగు దీనినిండా శ్లోకాలూ, ఇంగ్లీషువాక్యాలూ లెక్కకుమిక్కి కనబడుతూవున్నవి. దీనిని మనభావాలతో కాకుండా ప్రాచీనులభావాలతో మేకుబందీ చేసినారు. ఏవిషయమడిగినా ప్రమాణవాక్యంలేందీ మాటాడరు మాఆచార్లువారు. అందులో ఇది పెద్దవిషయమాయె! ఇంతటితో తేమల్చినారు— సంతోషమే! సంస్కృతాంగ్లభాషావాఙ్మయవిశారదులు మాఅన్యత్ములు చాలాబాగున్నదన్నారు దీనిని మొట్టమొదటనే తాముచదివి. వారు చదువుతూవున్నప్పుడు నలుగురూ విమర్శిస్తూ, వివరిస్తూ వింటూవుంటే నాకూ చాలాబాగానే వున్నట్లుంది. ఏలాగైనా క్లిష్టమైన సమస్యగదా!

# ఇబ్సన్: ఆధునిక సాంఘికనాటకనిర్మాత

మోటుపల్లి రామానుజరావు, ఎం. ఏ. ఫ్రెంచి డిప్లొమా.

ఆధునిక పాశ్చాత్యనాటకమునకు ఇబ్సన్ సృష్టికర్త. పందొమ్మిదవ శతాబ్దాంతము నుండి యీతనికాలమువఱకు యూరపుఖండపు నాటకవాఙ్మయ మొక నిస్సారమైన చవిటిపఱ్ఱ. ఫ్రాన్సుదేశమున రసైన్, మోలియరులును, ఇంగ్లాండున షేక్స్పియర్, కాంగ్రీవు, షెరిడన్ మొదలగువారును, జర్మనీయందు షిలర్, లెస్సింగ్ ప్రభృతులును నివసించినకాలమున నాదేశములందు నాటక మత్యున్నతస్థానము నాక్రమించుకొనియుండినది; కాని యీ యుగమున వారిసములు పుట్టమిచే క్రమేణ నది క్షీణించిపోయినది. ఉత్తమనాటకము పుట్టకున్నను ఈకాలమున నాటకప్రదర్శనాకౌశలము హెచ్చినది. జగద్విఖ్యాతులగునటకులు నాట్యకళాప్రదర్శనమున దమ ప్రతిభను జూపించిరి. మఱియు విద్యుచ్ఛక్తి, రంగులతెరలు మొదలగు పరికరములు వ్యాప్తిలోనికివచ్చి నాటకప్రదర్శనమునకు మెఱుగుజేకూర్చినవి. మొత్తముమీద నీకాలమున నాటకసృష్టికిగాక, నాటకప్రదర్శనాకౌశలమునకే ప్రాధాన్యము వచ్చినది. ఇట్లనుటలో నీకాలమున బొత్తిగా నాటకరచన కావింపబడలేదనికాదు. అనేకనాటకము లీకాలమున బుట్టినవి. కాని యవన్నియు ప్రేక్షకుల యుబుసుపోకకు సాయపడుటయే ప్రధానోద్దేశముగా గలవి. క్రొత్తభావములు, నూత్నసమస్యలు, ఉన్నతాదర్శములు, మానవహృదయమును జక్కగా జిత్రింపజాలిన ప్రతిభ, ఆనందము నాపాదించి రసతృష్ణను దీర్పజాలిన శక్తి—ఇవన్నియు వీని నుండి దూరములై, ఆకాశపు కవిత్వమును, నవలలను అలముకొన్నవి. ఇట్టిసమయమున ఇబ్సన్ మహామహు డుదయించెను. అప్పటివఱకు స్తంభించియుండిన నాటకలోకమును నుఱ్ఱూతలూచి, మానవప్రతిభకు నూత్నవికాస మొసగి, నాటకనిర్మాతల దృక్పథములు క్రొత్తత్రోవకు ద్రిప్పి, యాతడు కృతకృత్యు డాయెను.

ఇబ్సన్ మొత్తముమీద నిరువదియెన్మిదినాటకములను రచించెను. కాని మనము చర్చింపనది వీటియన్నిటినిగూర్చికాదు; మఱి, ఈతని మధ్యకాలమునకు జెందిన సాంఘిక నాటకములనుగూర్చిమాత్రమే. బాల్యమున రచించిన నాటకముల ప్రత్యేకప్రతిభ యేమియు గానరాదు. అవి పురాతనసంప్రదాయములకు బద్ధములైనవి. ఈతని మొదటియుత్కృష్టనాటకము "బ్రాండు" (Brand—1866); తర్వాతిది "పియర్ గింటు" (Peer Gynt—1867). వీటి రచనవలననే యీతనిఖ్యాతి యూరపంతయును బర్వెను. అనేకవిధములుగా నీరెండును ఈతడు తర్వాత రచించిన నాటకములకు భిన్నములు. పద్యరూపముగా వ్రాయబడిన వీటిని నాటకములనుటకంటెను కావ్యములనుటయే సమంజసమని మనకు దోచును. వాటినిగుఱించి మనకిప్పుడు ప్రసక్తిలేదుకాని, వాటినిగూర్చి యొకటిరెండుమాటలు చెప్పినగాని ఇబ్సన్ యొక్క భావపరిణామము స్పష్టముకాదు. "బ్రాండు"నందు మానవుని ఉన్నతాదర్శములకును, లోకసంప్రదాయములకును గల నిరంతరసంఘర్షణము చక్కగా జిత్రింపబడియున్నది. ఈలోకమున మహో

న్నతాదర్శములకు మానవహృదయమునందక్క చోటులేదు. వానిని మన మాచరణములోనికి దేవలయున్నచో, మన పరిస్థితుల ననుసరించి, మన పరిసరములకు దగినట్లు, వాటిని మార్చుకొనుటయో, సవరించికొనుటయో కావింపవలయును. లోకము ఇట్టిసవరణపై ఆధారపడియున్నది. దీనిని గ్రహింపజాలనివాడు కష్టములకు గురియగును. బ్రాండు ఒక మతప్రవక్త. తన ఆదర్శములను, అభిప్రాయములను కాలానుగుణముగా తీర్చిదిద్దుకొనుట నీచమని తలంచినాడు. అట్లు చేయక అనేకకష్టములకు లోనైనాడు. ఇందు మఱొకవిశేషము. బ్రాండు తనఆదర్శములను మహోన్నతములుగ భావించినను, మన కవి యట్లు గాన్పింపవు. అట్టివాటికై తనజీవితమును వమ్ముచేసికొని, తనతోబాటు తన్నునమ్మికొనియున్నవారలనుగూడ వృథాకష్టములపాల్జేసెనని నిందించుటకుబదులు, అతడు మనఃపూర్వకముగా నిజమనినమ్మిన ఆదర్శములకై సర్వస్వము సమర్పింపజాలిన వీరుడని ఇబ్సన్ బ్రాండును స్తుతించినాడు. అసత్యాదర్శములలో నైచ్యములేదు; కాని కాలానుగుణముగా స్వలాభముకోసము వానిని మార్చుకొనుటలో నైచ్యమున్నదని ఇబ్సన్ మతము. ఈభావము "పీర్ గింటు" నందు వ్యక్తపఱుపబడినది. ఈనాటకము "బ్రాండు"నకు బ్రతియని చెప్పవచ్చును. దీని కథానాయకుడైన పీర్గింటునకు లోకమున హాయిగా జీవింపజాలుటయే పరమాదర్శము. ఇట్లుచేయజాలుటకై అతడు తనభావములను, ఆదర్శములను, కోరికలను, నిమిషనిమిషమునకు మార్చికొనుచు, వ్యక్తిత్వమును జంపివైచికొని, జీవితమును ధ్వంసము చేసికొన్నాడు. ఇట్టిజీవితముకంటెను మృతి మేలని ఇబ్సన్ ఆశయము.

పైరెండునాటకముల రచనానంతరము ఇబ్సన్ సమకాలికసంఘముపై దృష్టిద్రిప్పెను. 'మానవకోటి కానందమునొసంగుటయే కళయొక్క పరమావధి,' 'Art for art's sake' అనుశుష్క సిద్ధాంతము నీత డామోదింపలేదు. మానవాభ్యుదయమునకుగూడ నది సాయపడవలయునని యాతని మతము. ఈయభిప్రాయమున కనుగుణముగా నీతడు సంఘదురాచారములను తననాటకములతో సవరింపబూనుకొనెను. "పీర్ గింటు"నకుదర్వాత రచింపబడిన నాటకము లట్టి ఆదర్శములను గలవే.

ప్రణయప్రహసనము (Comedy of love, 1868) నందు ఇబ్సన్ వివాహసమస్యను చర్చించి, దానిని తనతీక్ష్ణవిమర్శకు గుఱికావించినాడు. వివాహము స్త్రీపురుషులకు గాళ్ల సంకెళ్లవంటిది. తన్మూలమున వారిస్వేచ్ఛ అడుగంటును. 'భార్యాభర్తలు పరస్పరము ప్రేమించుకొనవలయును; వారొకరొకరిని వీడి విశృంఖలముగా జరింపరాదు' అని వివాహము శాసించును. కాని యిట్టిబలాత్కారము సహజప్రణయమునకు, వ్యక్తిత్వవికాసమునకును వేరుపురుగువంటిది. సహజముగ, అప్రయత్నముగ ప్రేమ పైకుబుకవలయునేకాని తెచ్చికోలున రాదు. మఱియు నిచ్ఛానుసారము ప్రేమించుటకు స్వాతంత్ర్యమునివ్వని ఈయాచారముయొక్క పవిత్రత యెట్టిది? వివాహము ఒకకృత్రిమనాటకమనియు, ఆచారమును రద్దుచేయువఱకు మానవకోటికి సుఖముండదనియు ఇబ్సన్ మతము. ఈనాటకమున నిద్దఱువ్యక్తులు ఒకరినొకరు విశేషముగా ప్రేమించుకొనియు, వైవాహికబాధ్యతవలన దమనిష్కళంకమైన ప్రేమకు మాలిన్యము దాకునేమోయని జంకి, వివాహమునకొల్లక విప్రలంభముననే కాలముగడుప దొరకొందురు. తత్కారణముగా వారిప్రేమ శరీరసంబంధలేశమాత్రమును లేనిదై, కేవలము మానసికమై, స్వచ్ఛమై విరాజిల్లినది.

దీనితర్వాతినాటకము "యువజనసమితి" (The League of Youth, 1869). ఇందు సంఘముయొక్క దుర్ణయములను, ముఖ్యముగా రాజకీయములైనవానిని ఇబ్సన్ నిరసించినాడు. స్టైన్సుగార్డు ఒక రాజకీయప్రవక్త. ఉద్రేకించు ఉపన్యాసములతో ప్రజల ఆదరామోదములను బడసి, సమయానుసారముగా నొకరాజకీయకక్షనుండి మఱొకకక్షకు చెంగుచెంగున దాటు స్వభావము గలవాడు. ఇతనికి ఉన్నతాదర్శములు లేవు; ఉదారభావసంపత్తి పూజ్యము. మాట ప్రజాక్షేమముపై; మనసు స్వలాభముమీద.

ఈకడపటి రెండునాటకములందలి పోకడలు తర్వాతినాటకమగు "సంఘస్తంభములు" (Pillars of society, 1887) బాగుగా వ్యక్తపరచినది. ఇంతవఱకు ఇబ్సన్‌రచించిన నాటకములతని నాటకరచనాభ్యాసకాలమునకు జెందినవి. అవన్నియు పద్యరూపములుగా రచింపబడినవి. కాని యీనాటకముమొదలుకొని తక్కినవన్నియు మునుపటివానికి భిన్నములై నూత్నమార్గమును త్రొక్కినవి. ఆదర్శమునందేమి,రచనాపద్ధతియందేమి వానియం దొక ఐక్యము కాననగుచున్నది. అన్నియును వచనమున రచితములు. సామాన్యముగా నన్నియును ఒకటిరెండుగంటలలో ప్రదర్శింపదగినంత చిన్నవి. పాత్రలు పలువు రుండరు; ఏనలుగురైదుగురో. అన్నియును సమకాలపు సంఘమురాచారములనే ఖండించునవి. సుప్రసిద్ధులయు, ధనికులయుగాక సాధారణజనజీవితమునే యితివృత్తముగాగలవి. అప్పుడప్పుడు రాజకీయములు చర్చింపబడినను, సాధారణముగా నన్నిటియందును సామాన్యుల సాంసారికమే చిత్రింపబడినది. వ్యక్తులను, సంఘమునను సతతము తటస్థించు సంఘర్షణయే వాటికన్నిటికి ప్రియతమమైన సన్నివేశము. వ్యక్తుల మానసికప్రవృత్తులయందు తటిల్లతలవలె క్షణక్షణము సంభవించు మార్పులను తత్కారణములతో జిత్రించుటయే వాని ముఖ్యాశయము.

"సంఘస్తంభముల"యొక్క కథానాయకుడు కార్స్టన్‌బర్నిక్ అనునతడు. పైకి మర్యాదస్థుడు; కాని నిజముగా మాయావి. కేవలము స్వార్థపరుడు; కాని సంఘమున కాదర్శపూరుషునివలె గాన్పించును. తనయూరియందు రైలువేయునుద్యమము బయలుదేరినప్పుడు తనయోడవర్తకమునకు నష్టమురావచ్చునని జంకి దాని నడ్డగించును. కాని తనభూములమీదుగా వేయబడనున్న రైలువలన తన కెక్కువలాభమువచ్చునని గ్రహించి, దానికై పాటుపడును. వివాహితయైన యొకనర్తకితో సంబంధముగల్గియుండియు, లోకమునకు జంకి, ఆనిందను మఱొకనిపై మోపును. తనకంపెనీలో డబ్బులేనప్పుడు, దొంగతనమువలన డబ్బు వ్యయమైనట్లు వదంతిని బుట్టించి, ఆనేరమును తాత్కాలికముగా నొకస్నేహితునిపై మోపును. అతడు శిథిలమైన తనయోడమీద అమెరికాకు బయనముకాగా, అతనిమృతి తన కన్నివిధముల సహాయకారి యగునని తలచి, తత్క్షణమే యాపడవ లేవుపడలుట కాజ్ఞయిచ్చును. కాని తనకుమారు డాపడవయందే దాగియున్నాడని తెలియవచ్చినప్పు డీతనిదుఃఖమునకు మేరయుండదు. ఈ విషాదానలమే యాతని శుభ్రపఱచి, మార్చివేయును. ఇదివఱకు రోర్‌లెండుమొదలగువారు తెల్పుచుండిన సంఘనీతికిని, ఆదర్శములకును లొంగియుండి, తన వ్యక్తిత్వము చంపికొనిన తెఱంగాతనికి విశదమగును. అట్టిజీవితము హేయమని తలచి, యాతడు తననైజము నెల్లరకును విశదీకరించి, సంఘనీతికి దాసులై మెలగు తదితరులనుగూడ సంస్కరింపబూనుకొనును. సంఘమర్యాదకు లొంగని స్త్రీ లీనాటకమున మువ్వురు. ఒక్కతె నర్తకియొక్క కుమార్తె. తాను

పుట్టిపెరిగిన సంఘమునందలి జనులు నిరర్థకపు సంఘమర్యాదలకు బ్రాకులాడువారనియు, గావుననే తన్ను దనతల్లికారణముగా దృఢీకరించి అగౌరవపఱచుచున్నారనియు, అమెరికా దేశమున నిట్టిమర్యాదలకు జోటులేదనియు నమ్మి, అటకుబోవ బయలుదేరును. మఱొక స్త్రీ సంఘమర్యాదలకు లొంగియుండి, తనవ్యక్తిత్వమును పూర్తిగా జంపుకొని, మంచియిల్లాలని పించుకొనినది. ఆమెకు యాథార్థ్యము గోచరించినప్పుడు తనజీవితము నసహ్యించుకొని, తన వలెనే జీవితమును నిరర్థకముచేసికొనకుడనియు, స్వేచ్ఛయే వ్యక్తిత్వపోషణమునకు బ్రధాన మైనదనియు తదితరులకు జాటును. మూడవస్త్రీ మొదటినుండియు సంఘనీతిని ధిక్కరించి, విశృంఖలముగా జీవించి, తన వ్యక్తిత్వమును వికసింపజేసికొనినది. నాటకాంతమున బర్నిక్ సత్యము, స్వేచ్ఛ యను రెండు సద్గుణములే మానవసంఘముయొక్క స్తంభములని చాటును. కాని ఇబ్సన్ మతమున ఈమాటలయర్థము వేరు. స్వేచ్ఛయన సంఘనీతియొక్కయు, సామాన్య జనాదర్శములయొక్కయు దాస్యమునుండి విముక్తిగాంచుట. సత్యమనగా వాగ్రూపముగా నబద్ధముపల్కమియే కాదు; మఱి, విషయము లున్నవున్నట్లు గ్రహించుట. మన కవి వచ్చిక పోయినను, లోకుల కవి రుచ్యములు కాకున్నను వాటిని మఱుగుపఱపక, వాని యాథార్థ్యమును గ్రహించి, మనలను మనమే మోసగించుకొనకపోవుటయును.

బొమ్మరిల్లు (Doll's House, 1879) వైవాహికాదర్శములను ఖండించుచున్నది. కథా నాయకుడు హెల్మర్. అతడు తనభార్యయగు నోరాతోడను, ముగ్వురు బిడ్డలతోడను సుఖముగ నుండును. తనభర్త ఆదర్శపురుషుడని నోరా నమ్మును. కాని త్వరలోనే ఆమెకు నిజము తెలియవచ్చును. భర్త యిదివఱకు రోగపీడితుడై దూరదేశమున కేగవలసివచ్చినప్పుడామె తన తండ్రిపేరును తానే సంతకముచేసి, క్రోగ్స్టాడ్ అనునాతనికడనుండి ధనమును స్వీకరించును. తాను చేయున దక్కృత్యమని పాప మామెకు దెలియదు. కొంతకాలమునకు హెల్మర్ బ్యాంకి మానేజరగును. క్రోగ్స్టాడ్ ఈబ్యాంకియందే ఉద్యోగమును బడయగోరి, నోరాసాహాయ్యము గోరును. నోరా మొదట ఇష్టపడదు. అప్పుడాతడు నోరాయొక్క కృత్రిమసంతకమును జ్ఞప్తికి తెచ్చి, ఆవిషయమును బహిరంగపఱతునని బెదరించును. తర్వాత హెల్మర్తో నావిషయమై ప్రసంగించినప్పుడు హెల్మర్ క్రోగ్స్టాడ్ను తీవ్రముగా నిరసించుచు, వాడిదివఱకు జేసిన తప్పు సంతకపునేరమును దెల్పి, అట్టినేరములకుబాధ్యులు తల్లులేయనును. అప్పుడు నోరా తన చేసిన తప్పును గ్రహింపగల్గును. తర్వాత ఆమె పత్రమును క్రోగ్స్టాడ్నుండి గ్రహించుటకై యత్నించి తనకును, తనభర్తకును జిరకాలపుస్నేహితుడైన రాంకు అనువాని సాయ మపేక్షించును. రాంకు తన కామెపైగల వలపును దెలుపును. వెంటనే ఆమె వానినుండి మరలును. కాని ఆమెకొక క్రొత్తవిషయ మిప్పుడు తెలియవచ్చినది. తనభర్తకడ తా నిదివఱకు బొందుచుండిన గౌరవమునకు గారణము తన స్త్రీత్వముగాని తాను కాన ట్లామెకు వ్యక్తమయినది. కాని యింకను సంప్రదాయములపై మమతపోలేదు. తనభర్త అసదృశుడనియు, దన్ను గాపాడుటకై తన సర్వస్వము నిచ్చి వేయుననియు నమ్మును. అట్టివాని కగౌరవము నాపాదించుటకంటెను మరణించుటయే మేలను కొనును. ఇట్టి యభిప్రాయములతో నామె తననేరము నాతనికి దెల్పినప్పుడు ఆత డాగ్రహా గ్రస్తుడై, పరుషవాక్యములాడును. ఇప్పు డామెకు యాథార్థ్యము గోచరించినది. తనసంసారము

భర్త, ప్రేమ, బిడ్డలు,—ఇవన్నియు కేవలము భ్రమాజనితములని యామెకు దోచును. తన యిల్లొక బొమ్మరిల్లువలెను, అందు దానును, దనభర్తయు కృత్రిమనాటక మాడుచుండినట్లును ఆమె తలచును. వెంటనే గృహమును వీడి, లోకముయొక్క యాథార్థ్యమును దెలిసికొన బయలుదేరును. ఆమెభర్తయు నామెమనస్సును గ్రహించి, లోకమున స్త్రీపురుషులకు నిజమైన, గౌరవప్రదమైన సంబంధ మెన్నటికైన గలుగునా యని చింతించును.

'దయ్యములు' (Ghosts, 1881) అనునాటకమున ఇబ్సన్ బొమ్మరిల్లునందు చాటిన సత్యములనే బలపఱచినాడు. వివాహము అనునది కేవలము మానుషికము, దైవత్వముగాని పవిత్రతగాని అందేమియు లేదు. దానికొఱకై అనేకమానవులు వృథాగా బలియగుచున్నారని ఇబ్సన్ భావము. ఇందు కథానాయకుడగు ఆల్వింగు స్త్రీలోలుడు; త్రాగుబోతు; కాని పైకి మర్యాదస్థుడు. అతనిభార్య ఆతని విశేషముగా ప్రేమించి విధ్యుక్తముగా తనజీవితమును సాగించును. భర్త తన కండ్లయెదుట పనికత్తెలను ప్రేమించుట మొదలగు దుర్నయములను జూచి, ఆమె అతని సేవగించుకొనియు, లోకమర్యాద కనుగుణముగ మెలగును. భర్తదుండగములను లోకులకును, దన చిన్నికుమారునకును దెలియనీయక కప్పిపుచ్చును. ఇట్లు పరిస్థితు లామెను లోకమర్యాదకు, వివాహసంప్రదాయమునకు బలియొసంగినవి. ఒకసరి భర్తతోడి జీవితము దుస్సహమైనప్పు డామె తాను చిన్ననాడు ప్రేమించిన మాండర్సు నండ చేరజూచును. కాని మాండర్సు కూడ సంఘమర్యాదకు దాసుడే కావున ఆమె నంగీకరింపక బుద్ధులుచెప్పి భర్తకడ కంపివేయును. చేయునదిలేక ఆమె తనధర్మనిర్వర్తనమునందే సౌఖ్యమును బడయగోరి భర్తకడకు వచ్చును తదనంతర మామె భర్త కీర్తికళంకము రాకుండునట్లు సహించుకొనును. కాని యిదంతయును కేవలము నటన; కృత్రిమము. రాత్రులయందు తనభర్త బాగుగా త్రాగియుండినప్పు డాతడు వీథిలోనికిబోయి తన త్రాగుబోతుతనమును లోకులకు దెలియజేయకుండుటకై ఆమె ఆతనితో నుంటకు సహించుకొనును. తనభర్త చెఱచిన స్త్రీలను బోషించుచు, వారిలో నొకర్తకు బుట్టిన యాడుబిడ్డను దనఇంటిలో బనికత్తెగా నుంచుకొనును. ఇట్లామె సహించుకష్టములకు మేర యుండదు. తన కుమారుడైన ఆస్వోల్డు తండ్రికడనుండిన నతనికి దండ్రిమీద నుండవలసిన గౌరవము పోవునేమోయని శంకించి, విద్యార్జనము నెపముగా దూరదేశమునకు బంపును. ఇట్లామె మెలగి, యెల్లరిగౌరవమునకును పాత్రురాలగును. తదనంతర మామెభర్త చనిపోగా, నామె అతనిపేర అనాథశరణాలయమును గట్టించి, గతమును గప్పివేయ దలచును. కాని అట్లు కొనసాగదు. ఆమెకుమారుడు తండ్రిగుణములనేకాక తండ్రిరోగములనుసైతము గ్రహించినాడు. తనకు జెల్లెలివరుసయై, యింటిలో బనికత్తెగానుండిన రెజీనా ఇంగ్స్ట్రాండును అతడు ప్రేమించును. తనకుమారుని దుర్నయములనుజూచి యేవగించుకొనక, అతని సౌఖ్యమున కడ్డుపడుటకు దన కధికారములేదని యామె గ్రహించును. లోకమర్యాదకై తనకుమారుని బలియీయ కూడదని ఆమె దృఢపఱచుకొనును. అతని జీవితమును సౌఖ్యవంతముచేయుటకై, దేనినైనను చేయ నిశ్చయించుకొనును. తండ్రిమూలమున దనకువచ్చిన రోగము క్రమేణ తన్ను బిచ్చివానినిగా జేయునని యొకవైద్యుడు ఆస్వోల్డునకు చెప్పగా నాతడు అట్టిదశకంటెను మరణమే మేలనితలచి ఆసూచనలు పొడసూపగనే త్రాగుటకై విషము నెప్పుడును తనయొద్దనుంచు

కొనువాడు. తుట్టతుద కట్టినూచనలు కన్పించగనే వానితల్లియే ఆకార్యమును కావించి అతని కోర్కెను నెఱవేర్చును.

ప్రజాశత్రువు (An Enemy of the People, 1882) అను నాటకమునందు ప్రస్తుతపు రాజకీయాదర్శములను, అందు ముఖ్యముగా ప్రజాస్వామికమును నిరసించినాడు. ఇబ్సన్‌కు ప్రజాస్వామికమన్న రోత. అధికసంఖ్యాకుల ఒప్పుకోలుపై ఆధారపడునది ఆప్రభుత్వము. కాని ఏదేశమునగాని అధికసంఖ్యాకులు పామరులే. స్వల్పసంఖ్యాకులే ప్రతిభాశాలురు. వారలే ఒకదేశముయొక్క అభ్యుదయమునకు తోడ్పడువారు. దేశముయొక్క గొప్పదనము వారియందే ఆధారపడియుండును. కాని అట్టివారికి ప్రజాస్వామికప్రభుత్వమున విశేషము చోటువయుండదు. మెజారిటీలపై ఆధారపడు ప్రభుత్వము ఎప్పుడును వమ్మే. అది మైనారిటీలను లొంగజేసికొని, వారల వ్యక్తిత్వమును జంపివేయును. ఇట్టివి ఇబ్సన్ అభిప్రాయములు. ఇవి ఈనాటకమున వ్యక్తపఱుపబడినవి. ఈనాటకమున సామాన్యజనులయొక్క మెజారిటీలు కావించు దుండగములు చిత్రింపబడినవి. స్టాక్‌మన్ అనునతడు కథానాయకుడు. అతడొకపట్టణమున వైద్యుడు. ఆపట్టణమున నాతనిమామకు తోళ్లను బాగుచేయు యంత్రశాలలు కలవు. వీటినుండి వచ్చు నీటివలన నాయూరికొలాయీలనీరు కలుషితమగుట, తన్మూలమున జనులు రోగపీడితులగుట నితడు గ్రహించెను. ఈవిషయము నాతడు బహిరంగపఱుపదలచును. కాని పురపాలక సభాధ్యక్షుడైన యతనిసోదరుడు తనకాలమునందు వేయబడిన కొళాయీలు కావున తన కట్టి కళంకము వాట్లునోయని, యాతనిబునని మాన్పదలచును. పౌరులు నీవిషయము బహిరంగమయిన అందఱనుక నారోగ్యమునిమిత్తమె వచ్చుచుండిన విదేశీయులు రారనియు, దానివలన పట్టణమునకు, దమకును వచ్చురాబడి తగ్గుననియు దలచి, యాతని యుద్యమమును మాన్పదలతురు. తుద కాయూరిపత్రికలుకూడ అతనితో సహకరింపవు. కాని స్టాక్‌మన్ సత్యబద్ధుడై వారిని వినడు. అందువలన నాతడు పడునష్టములకు మేరయుండదు. ఉద్యోగమును గోల్పోవుటయేకాక, ఆరడు సంఘమునుండి బహిష్కృతుడగును. ఎక్కడకుపోయినను తిట్లే, అమర్యాదలే. అందరు నతనిని ప్రజావిరోధియని చాటించి, పలుబాములను బెట్టుదురు. కాని యాతడు దీనినంతయు సహించి ప్రజను తనవైపునకు త్రిప్పుకొన యత్నించును. ఇట్లీనాటకమున సామాన్యజనుల మెజారిటీ ఎట్లు వ్యక్తులనుగా మార్చి, వారి వ్యక్తిత్వమును జంపివేయునో చాటబడినది.

ఇబ్సన్‌యొక్క కడపటి సాంఘికనాటకము "రోస్‌మర్ దంపతుల గృహము" (Rosmers home, 1886). కథానాయకుడు రోస్‌మర్ మతబోధకుడు; సద్వంశీయుడు; ధనవంతుడు; లోకము నుద్ధరింపవలయునను ఆదర్శముగలవాడు. అతని భార్య గుణవతి; అతని విశేషముగా ప్రేమించునది. కాని తనభర్తఆదర్శము అసంభవమగు పిచ్చియూహయని నమ్మకముకలది. రోస్‌మరున కీమె యిట్లనుకొనుట నచ్చదు. వీరికడకు రిబెక్కా వచ్చును. రిబెక్కా విద్యావతి; వయసున చిన్నదైనను ప్రౌఢ. ఒకనిమేషమున పరిస్థితులను దెలిసికొని, రోస్‌మర్ ఆదర్శము నామోదించి, అతని హృదయమును జూఱగొన్నది. రిబెక్కా రోస్‌మరులు పరస్పరము ప్రేమించుకొందురు. కాని వారిప్రేమ వారలకే తెలియదు. రోస్‌మర్‌యొక్క భార్య దీనినిగ్రహించి తనభర్తకును, అతడు ప్రేమించిన స్త్రీకిని అడ్డముండకూడదనుకొని, ప్రాణ

త్యాగము చేసికొనును అందఱు నామె మతిభ్రమచే నిట్లు కావించెనని తలతురు. కాని రిబెక్కా రోస్మరులకు యాథార్థ్యము తెలియును. రిబెక్కా మిక్కిలి చింతించును. ఈచింతలో నామె కదివఱకు రోస్మరుపైనుండిన మోహము క్షయించినది. దానికిబదులుగా స్వచ్ఛమైన, నిష్కళంకమైన ప్రేమ పుట్టినది. రోస్మరును కార్యవీరుడవు గమ్మనియు, లోకాభ్యుదయమునకు ప్రయత్నింపుమనియు బురికొల్పును. కాని అతడు తన అంతరాత్మ శుభ్రముగా లేనప్పు డట్టికార్యమునకు బూనుకొనజాలనని చెప్పును. అప్పుడు రిబెక్కా, అతనిభార్య చనిపోవుటకు తానే కారకురాలనియు, ఆమె శంకించుచుండినప్పుడు ప్రాణత్యాగము చేసికొన దానెట్లు పురికొల్పినదియును జెప్పును. తర్వాత తమకావించిన పాపపరిహారార్థ మిర్వురును ప్రాణత్యాగము కావించికొందురు.

ఈనాటకమే ఇబ్సన్ యొక్క కడపటి గొప్పసాంఘికనాటకము. దీనితర్వాత నాతడు పూర్తిగా నాటకరచన మానుకొనలేదు. కాని ఆనాటకములన్నియు వేరుతెగకు జేరినవి. ఐయోల్ఫ్, (Eyolf 1894), బోర్క్మన్ (Borkmann, 1896), పునర్జన్మ (When we dead Awaken, 1900) అను నాటకములు భావప్రధానములై, ఉదారాశయములను, ఉత్కృష్టధర్మములను జాటుచు, ఇబ్సన్ ప్రతిభ కెంతయును వన్నెదెచ్చుచున్నవి.

ఇంతకుబూర్వమే సూచింపబడినట్లు ఇబ్సన్ యొక్క నాటక రచనావిధానమున నొక ప్రత్యేకత కలదు. 19-వ శతాబ్దమున యూరపునాటకలోకమున రచనాచమత్కృతియందు పేరెన్నికగన్నవారు ఫ్రెంచికవులయిన స్క్రైబ్ డ్యూమాస్‌లు (Scribe and Dumas). స్క్రైబ్ రచనావిధానమున క్రొత్తమార్గములు చూపెను. డ్యూమాసు తన నాటకములను భావప్రధానములుగాజేసి, స్క్రైబ్ యొక్క విధానమునకు మెఱుగుదెచ్చెను. ఇబ్సన్ ఈయిద్దరి మార్గములను స్వీకరించెను. కాన నాతని నాటకములు రచనాచమత్కృతిని గలవియేకాక, భావగాంభీర్యములుగాగూడ నున్నవి. నాటకరచనమున ఇబ్సన్ కనబఱచిన ప్రత్యేకలక్షణములు దిగువ చెప్పబడినవి:—

(1) ఇబ్సన్‌నకు కథమీదకంటెను భావములమీద ఆసక్తిమెండు. ప్రేక్షకులదృష్టిని మఱలింపజాలు ఘోరములు, చిత్రములు నగు సన్నివేశముల నీతడు నిరసించెను. యాదృచ్ఛికములు, హఠాత్సంభవములు, స్వగతములు, యుద్ధములు, మొదలగునవి యీతని నాటకములందు గానరావు. కథ మిక్కిలి సహజమై, జనులెల్లరి దైనందిన చర్యతో సంబంధము కలదిగానుండును.

(2) నాటకమునందు అనేకరంగములుగాని, అనేకపాత్రలుగాని యుండవు. కథయంతయు సాధారణముగా ఒకటి రెండు దినముల పరిమితిగలదియై యుండును. రంగస్థలమునందు నాటకము ఒకటి రెండు గంటలలో జూపదగినదై యుండును; తత్ప్రదర్శనమునకు విశేషపరికర సంపత్తి యనవసరము.

(3) సాధారణముగా నాటకములన్నియును వ్యక్తుల ఆదర్శములకును, సంఘసంప్రదాయములకును గల వైషమ్యమును జిత్రించును. చమత్కారమైన వాగ్యుద్ధముచే మనకు క్రొత్త సత్యముల నీనాటకములు తెల్పును.

(4) నాటకములందు చూపబడుకథ అత్యల్పము. కథయందు జాలభాగము సూచ్యమే. మఱియు రంగస్థలమున మరణములు మొదలగు విషాదకరమైన విషయములు జూపబడవు.

(5) ఇతరనాటకకర్తలు సాధారణముగా గడపటియంకమున దెల్పు కథాభాగముతో నీతడు తన నాటకమును బ్రారంభించును. గడచినకథను సంభాషణమూలమున మనకు దెల్పి నాలుగైదు రంగములతో గథను బూర్తిగావించి, మన హృదయములను జూఱగొనును.

(6) ఈతని నాటకములను జదువునప్పుడుగాని, చూచునప్పుడుగాని యితడు మనలోకమునకంటెను భిన్నమైన కృత్రిమలోకమును జిత్రించుచున్నా డన్నభావము మనకు దట్టదు. అనగా నతడు తన నాటకముల నంత సహజములుగను, యథార్థములుగను జేసెనన్నమాట. అందు వచ్చుపాత్రలు మనమే యనియు, వారిసంభాషణ మనమాటలే యన్నభావము మనకుదయించును.

ఇట్టినాటకచక్రవర్తినిగూర్చి ఆంధ్రులలో బలువురి కేమియు దెలియదు. ఆతని కళాప్రతిభ ఆంధ్రనాటక లోకమునుగూడ వెల్గింపజాలినదని నాయాశయము. అట్టివాని గ్రంథపఠనమునకు ఆంధ్రయువకులను బ్రోత్సహింప నీవ్యాసము వ్రాయబడినది.



# 'వేనరాజు'

## గుఱ్ఱం వేంకటసుబ్రహ్మణ్యం

విశ్వనాథసత్యనారాయణగారి 'వేనరాజు' ఆంధ్రభారతికి నూతనాలంకారము. ఈదేశమున నాటకముదయించి అర్ధశతాబ్దమైనను, ప్రతిభావంతమైన కృతులు విరళవిరళముగా నున్నవనుట సత్యదూరముకాదు. ప్రచారము గొప్పదైనను, కొద్దిదైనను రసజ్ఞులమదికెక్కిన కొలది కృతులలో వేనరాజు దొడ్డది. 'నర్తనశాల' వెలువడినపుడే సత్యనారాయణగారు నాటకలోకమును సాధించినవారైరి. వేనరాజుతో వారి కందు స్థిరపీఠము కుదురుకొన్నది.

వస్తుతత్వమునుబట్టి తెలుగునాటకములను మూడుతెఱగులుగా విభజింపవచ్చును: జాతిగౌరవమును పోషించునవి—ప్రతాపరుద్రీయము, బొబ్బిలి మున్నగునవి; వ్యక్తిగౌరవమును పోషించునవి—నర్తనశాలవంటివి; భావగౌరవమునే ప్రధానముగాగలవి—శబరి, రేణుక మున్నగునవి. ఇట్టివిభజన ప్రాధాన్యమునుబట్టియేకాని ప్రత్యేకతనుబట్టికాదు. వేనరాజునాటకమున వ్యక్తిగౌరవమును, భావగౌరవమును సమభాగములుగా నున్నవి. 'ఇట్టిసత్వమున కేమిగతి' అనుప్రశ్నతోగూడ 'ఇట్టితత్వమున కేమిగతి?' అను కుతూహలమును జీవింపజేయుచున్నది. వేనుని పతనము ఒక జీవితమునకుమాత్రమే అధ్యాయాంతముకాదు; ఒకమతమునకే స్వస్తి.

అంగపుత్రుడగు వేనునిచరిత్రము శ్రీమద్భాగవతమున కలదు. అందలికథ కేవలము పౌరాణికము. ధ్రువునివంశమున అంగరాజు జనించి రాజ్యముచేసెను. అతనికి సునీథయందు వేనుడు జనించెను. వాని దుశ్శీలతకు విమనస్కుడై రాజు అడవులబట్టెను. వేనుడు సింహాసనమెక్కి పూర్వ్వరుల మార్గమును ధిక్కరించి ప్రజాపీడగావింప నారంభింపగా, ధర్మకోవిదులైన మునులు నయమున నతని వారింప ప్రయత్నించి సాధ్యముగామిచే హుంకారమాత్రమున ఈశ్వరనిందాహతుడగు నతని పొలియజేసిరి. తదనంతరము దేశమున అరాజకము ప్రబలుటవలన, ఋషులు వేనుని కళేబరమును మథించిరి. తొలుత ఊరువునుండి నిషాదు డుద్భవించెను. పిమ్మట దక్షిణబాహువును మథింపగా అర్చియు, పృథువు ననుమిథునము జనించెను. పృథువు దేవతలవలన ననేకవరములు పడసి, వంశదీపకుడై రాజ్యముచేసెను. భూదేవిని గోవుగను, హిమవంతుని వత్సముగను నొనర్చి, ఓషధుల పిదికి పృథువు లోకకల్యాణము గావించెను. అతనివలన భూమికి పృథ్వియను పేరువచ్చెను. ఇది పురాణగాథ.

నాటకమున వస్తువు అభినవమైనది. వేనుడు పెద్దత్రోవపట్టిన యొకమహాపురుషుడు; సంగీతశిల్పపారగుడు; కవిత్వతత్వధురీణుడు; స్నేహసంభరితుడు. ఇది అతని సహజప్రకృతి. కాని ఆర్షమతనిరాకరణమువలన చండశాసనుడు, క్రూరకర్ముడు, లోకకంటకుడునై అతడు పతనము గాంచును. కైవారము వలదని శాసించినాడు. ఆయాజ్ఞ నుల్లంఘించినందులకై ఒక వందివంశమును క్రమముగా నాశముచేసినాడు. వేనునిమాటకు వెనుబాటులేదు. కాని హృదయమునకే

వెనుబాటుగల్గినది. బలవన్మరణమందిన వందులందఱు పిశాచములై వేనుని భావలోకమును అతలకుతలముగావింపజొచ్చిరి. స్వమతవిశ్వాస మున్నవఱకును వేను డెట్టిపాపకర్మకుగాని, యెంత ఒంటిపాటునకుగాని వెనుదీయడు. తండ్రికి ఉన్మాదము, తల్లికి మృతి, మిత్రునకు వైరబుద్ధి కలుగ జేసియు చలింపడు. కాని ఆవిశ్వాసము సడలుటతోడనే ఆగాంభీర్యము అస్తమించును. చరమాంకమున గౌతముడు దక్షిణబాహువును సఱుకగా పడియున్న వేనుడు తండ్రిని చూచి 'తండ్రీ, అనర్హుడనైనను ఒక్కప్రశ్న యడుగుచున్నాను. నాతల్లి సునీథాదేవి యేమైనది? ఆమె నొకసారి అమ్మాయని పిలిచి నాచేసినపాపములకు నిష్కృతిచేసికొందును' అనుపట్టున మరల శిశుప్రాయుడు. మరణముచే నతడు ధన్యుడుగాని శోచనీయుడు కాడు. అందువలననే 'విషాదనాటకము'నకు ఉత్తమనాయకుడు. పాపఫలమునుడుచు ప్రతిప్రాకృతునిపాతమువలన వైక్లబ్యము జనింపదు. లోకాతిగులైనవారి పరిణామము వేఱురీతిగా నుండును. వేనుడు దుష్టమతముకతననేకాదు, స్నేహముకతనసైతము చ్యుతికాంచుచున్నాడు. కానియెడ మున్నే గౌతము నవలీలగాచంపి, విప్లవము నణచియుండవచ్చును.

వేనునితండ్రియగు అంగరాజుసృష్టిలో సత్యనారాయణగారిప్రతిభ చక్కగా రాణించినది. మొదటినుండియు చివరవఱకు అంగరాజు బహిఃస్థితినిబట్టి పిచ్చివాడు. కాని ఆపిచ్చిలో ఒక విశేషము గలదు. అది నటనగాదు, నిజమునుం గాదు. వార్ధక్యము, ధర్మాభిమానము, పుత్రాభిమానము, దారావియోగము కలిసి హృదయమున పొందిన యొకవిపాకమే ఆపిచ్చి. ఇతనికి గల పుత్రాభిమానము నాటకమున గుప్తముగా నున్నది. చివరకు 'నాయనా, నీబుద్ధి పెడత్రోవపెట్టినదికాని దాని నైశిత్య మప్రతిమానమైనదికదా' అని వేనుని సంబోధించునపుడు ఉబికినకన్నీళ్లతో ఆయభిమానముకూడ వెల్వడుచున్నది. ఉన్మాదదశయందు అంగరాజు ప్రలపించు గీతములు ఆంధ్రకవితకు నూతనములు. పాత్రకు అనురూపమైన ఆవేశము పరిపరివిధముల పొంగి ప్రవహించినది. దిఙ్మాత్రముగా దీని నవలోకింపుడు——

'అగ్నిహోత్రము నాకు నందిచ్చిన సునీథ
భుగ్నభ్రుపై నన్ను పొలువుదిద్దు సునీథ
నగ్నమనస్కయై ననుగొల్చిన సునీథ
ప్రాగ్నవోషఃపవిత్రతనూజ్జ్వల సునీథ
నీవెవ్వ రడుగగా నీవెవ్వ రడుగంగ.'

ఉన్మాదమునకు ఉన్నతమనస్కులకునుగల సన్నిహితత్వము ఇట్టిగీతములవలన అనుభూతమగుచున్నది.

గౌతముడు కథకు నూతనమైనను కాలమునకు నూతనుడుకాడు. సనాతన, సంస్కరణమతభేదముచే ఇరువురు ప్రాణమిత్రులు ఎడబడినవారై పరస్పరము మృత్యుకారకులగుట రవీంద్రనాథుల 'మాలిని' నాటకమున పరిచితమైయున్నది. గౌతమునినోట కవిపలికించిన వాదములు ప్రకృతకాలప్రబోధకములుగాగూడ నుద్దిష్టమైనట్లు తోచును. వేనుని వ్యక్తిస్వాతంత్ర్యవాదమును, గౌతముని అధికారవాదమును ముఖ్యముగా ఈకాలమున నిరంతరసంఘట్టనము నందుచున్నవి.

గౌతముడు ధర్మవాది. పూర్వఋషుల మహత్వమున నతని విశ్వాసము అప్రతిహతము. కవి సైతము అతనితత్వమునే అవలంబించినాడనుటకు నాందిపద్యముననే సూచనగలదు—'వేదవేదాంతములయందు వెలుగువెలుగు, మలగు చీకటిదారుల దొలచుగాక.' కాని మతావేశము గౌతముని హృదయమును కర్కశమొనరింపలేదు. వేనుని బాహువును నఱకినపుడుసైతము అతని స్నేహబంధము సడలదు. 'ఇంతటి మహాపురుషుడవు నీవీలోకమును వదలిపోవుచుండగా నేనేలాగున బ్రదుకుదును' అని యేడ్చును. పృథువు చక్రవర్తియగుటయేతడవుగా, తాను తపస్సునకై అడవుల కేగును. గౌతమునిలో నిజమైన ఆర్యహృదయము వ్యక్తమగుచున్నది.

ఈనాటకమున పృథుపాత్రముమాత్రము దుర్గ్రాహ్యముగా నున్నది. పుట్టువునుబట్టి పృథు వబల. గోరూపయగు భూదేవి పురుషత్వమును పృథువునందు ఆవహిల్లజేసినట్లు శంవిధాన మేర్ప ఱుపబడినది. వేనుని రోసినదై భూదేవి పృథువునే రాజుగావరించినది. రాజత్వముచేతనే గావలయు నారాయణాంశయు పృథువున కొదవినది. కథాసరణి భౌతికలోకము నతిక్రమించి భావుకలోకమున పదమిడినది. వేనునివలన నాటకమున కొనగూడిన వీరభావము పృథువుచే లలితభావముగా పరిణమించినది. ఇట్టిసంయోగము నాటకమునం దెంతవఱకు ప్రయోగ్యమో విచారింపదగును. సత్యనారాయణగారి కవనప్రతిభవలన ఈఅభూతకల్పనకును రమణీయమైన ఆచ్ఛాదనము కొంత లభ్యమైనది.

ఐనను చక్రవర్తులందు ప్రథముడైన పృథువునకు జన్మవలన స్త్రీత్వ మారోపించుట న్యూనతాహేతువగుచున్నది. శిఖండిప్రతికృతి ఆర్యజనులకు అభిమానపాత్రముగాదు. ఇట్టిపరి వర్తనకు ఆధారముగాని, అవసరముగాని సామాన్యదృష్టికి గోచరించుటలేదు.

కైవారముకథయంతయు సత్యనారాయణగారి ప్రజ్ఞాకల్పనము. వేనుని యాజ్ఞ నుల్లంఘించి వినీతభట్టుమనుమడు శ్రీధరుడను కుఱ్ఱవంది మనోహరముగా కైవారము జరుపును. వేను డతనితలతీయించును. దానితో వినీతభట్టుప్రాణములుపోవును. ఆవెంటనే శ్రీధరునితండ్రి అట్లే కైవారముచేసి సుతుని పరలోకమున కనుసరించును. ఆవెన్క వినీతభట్టువియ్యంకుడు, పదంపడి అతనిభార్య వేనుని కోపాగ్నికి హుతులగుదురు. వీరిపిశాచములు వేనుని బాధింప నారంభించును. భౌతికలోకమునకు పరమైన దొకటి యున్నదాయని శంకించిన వేనున కీయనుభవము కనులు విప్పును. క్రూరకర్మలవలన తన కీపిశాచత్వ మబ్బినదేమో. ఐనను వేనుడు పందగాడు. పిశాచములతో సంభాషణము జరుపును. వృద్ధపిశాచములభీషణప్రలాపములకన్న శ్రీధరుని జ్ఞాతాజ్ఞాతజల్పములే అతనిహృదయమును దహించును. ఈభూతములను ప్రత్యక్షీకరించుటయందును, వానిమనస్తత్వమును పరిశోధించుటయందును కవిరచనము అపూర్వమై, అతిలోకమై రాణించుచున్నది. ఇట్టిప్రకరణము భాసుని బాలచరితమున కొలదిగామాత్రమే కలదు. కంసునిసైత మిట్లే భూతములు బాధించును. కంసునకును వేనునకును మనస్సులందు కొంతపోలిక కలదు. దానిని సహృదయు లూహించుకొనగలరు. చివరకు వేనుడు బాహువుతెగి మరణశయ్యయందుండగా శ్రీధరభట్టుతల్లి నియమప్రకారము కైవారముచేయవచ్చును. కాని ఆమెకు బదులు ఆమె గర్భస్థశిశువు పృథుచక్రవర్తికి మనోహరముగా కైవారమాచరించును. కైవారమే కూడదని శాసించిన వేనుడు తుదకు 'జిగిమీరుచున్న' అప్రశంసాగీతిని ప్రశంసించును.

విపులమైన కైవారగాథతో సూక్ష్మమైన బ్రాహ్మణశాపవృత్తాంతమును జోడించి వేనుని పరిణామమును, కథానిర్వహణమును ఏకస్థాయికి తెచ్చుటలో కవినైపుణ్యము మెచ్చదగియున్నది. అవిశ్వాసముతో నిరాకరించిన ఆయాసత్యములే వేనుని పైకొని అతని అంతస్సౌధమును కూల్చినవి. దానితో అతని జీవమును జాతినది.

ఈనాటకమున తత్వగౌరవమును వివరించినట్లు రచనాప్రాగల్భ్యమును విశదపరచుట కష్టము. ఐనను ఇంచుక అవసరము. సంభాషణలు, స్వగతములు దీర్ఘములుగా నున్నవని కొందఱు అధిక్షేపించినను అధిక్షేపింపవచ్చును. కాని వ్యంగ్యప్రధానములై సంగ్రహమైన సంభాషణము లును విశేషముగానే కలవు. అవి ముఖ్యముగా అంకాంతములందు కననగును. తార్కాణ కీరెండు చాలును—

వినీతభట్టు:—వేనుడా, రెండుజాములైనది. మొగసాలలో గంటలు కొట్టుచున్నారు. నాయాశ యు ప్రాణములు నొకేసారి నాగొంతులో నిలిచిపోవునా యేమి?

(తెరలో)

కుంద్రవంది సెత్తురుచేత మాధ్యాహ్నికసంధ్యకును ఎఱ్ఱదనము వచ్చినది.

వినీతభట్టు:—(పడిపోవును.)
వేనుడు:—పృథూ, నీ వామందారపుష్పము తలకు పెట్టుకొనుము.
పృథువు:—వేనా, నీ వాకుంద్రవందితల మొలకు కట్టుకొనుము.

(ప్రథమాంకము)

వేనుడు:—పృథూ, చూచితివా? ఆపిచ్చివానిమాటలు, గజము మిథ్య, పలాయనము మిథ్య యన్నట్లున్నది.

పృథువు:—ఆయనది మిథ్యావాదముకాదు. అస్తివాదు.
వేనుడు:—అస్తివాదము కాదు, ఆస్థికలవాదము.
పృథువు:—ఆవాదము మనది.
వేనుడు:—అనగా?
పృథువు:—అనగా? వినీతభట్టు, వానియల్లుడు, వాని మనుమడు— వీరందఱి యస్థికలు మన వాదమువలననేకదా కల్గినవి. అసలు మనది అస్థికలవాదము.

(తృతీయాంకము)

ఇట్టి సంభాషణలు నిజముగా జిగిమీఱియున్నవి. కాని భావముమీద లక్ష్యముంచని ప్రేక్షకులకు మనోహరములు గాకపోవచ్చును.

సత్యనారాయణగారి పద్యకవితనుగూర్చి విశేషించివ్రాయుట అనవసరము. ఇప్పటి ఆంధ్రకవులందెల్ల వీరు ప్రధానులని చెప్పుట సత్యదూరముకాదు. ముఖ్యముగా పటుత్వమున వీరికి సాటిలేదు. ప్రతిభావ్యుత్పత్తులు రెండును సరితూగుచున్నవి. తమ శైలినిగూర్చి నిజాభి

ప్రాయమును వేనునినోట వీరు పలికించినట్లు తోచుచున్నది. 'ఒక చిక్కని తియ్యని శైలి కలవాని కవితయంతయు భావములవెంట మారక నొకరీతిని నడచుచుండును. భావమునకే ప్రాధాన్యమిచ్చు కవిత్వము శయ్యయు, భావమునుబట్టి మారును. కాని లోకము ఆశయ్యను ఆ.స్త్రీ సౌందర్యమునకు ప్రాధాన్య మిచ్చుచున్నది. కాదన్నచో వినదు. పదిమంది నడచినదే త్రోవ. మన మేమిచేయగలము ?' నిజముగా వీరిశైలి పురుషతత్వమువలె పటిష్ఠము. స్త్రీతత్వము వలె లాలిత్యప్రధానముగాదు. ఐనను ఎల్లపట్టుల అవస్థానురూపము.

'అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లా త్రిగండూషితత్రయు లౌర్వవహ్ని
గర్భితాంత స్తపస్కులు ఘనులు బుషుల
కెవ్వడు విరోధి తద్వ్యధ కెత్తినయది'

ఇట్టిశైలి భవభూతిని తలపించుచున్నది. మనోహరమైన నూతనభావన క్రిందిపద్యము ఉదాహరించుచున్నాను. వేనుని వీణానాదమును గౌతముడు ఆనందించి లోలోన మెచ్చుకొనుట.

'కలువపూలోని పచ్చలదిమ్మ చుట్టును
ముసరి తుమ్మెదగమి మ్రోసినట్లు
పెల్లిన యిసుకలమీద సన్ననినీటి
పొరజాలు ముర్మ్మర పుట్టినట్లు
తల్లిలోతెక్కలో దాగి వెచ్చగ నంచ
కూన క్రొమ్మెదవంచి కూసినట్లు
లేవెదుళ్ల పొద వాలించి పొలాలపై
నుండివచ్చిన గాలి యూదినట్లు

ఏపురాజన్మసంస్కారమో పరిణత
మై స్వయంగ్రాహ మందినట్లు, మంచు
గొండ తెల్లనికొమ్మున గూడుకట్టు
తుమ్మెదల పట్టు తేనియల్ తొణికినట్లు.'

*　　　　*　　　　*

'సారిది గోదుమవన్నె త్రాచు లొకటొకటి
ప్రేమ పెనవేసికొనుచు పింపిళ్లుకూసి
నట్లు గేదంగిపుప్పొడులందు మెరసి
పోయినట్టులు మధునాదమూర్తివై తి'

అని కేదారగౌళరాగము నుద్దేశించి సంబోధన.

వస్తు వెంతపరిచితమైనను ఇట్లు నవనవముగా తోపింపజేయగల భావనాశక్తి కలదు గావుననే కవి అంకితపద్యములందు 'సతత రసోద్గతిక్ తెనుగుజాతి రసజ్ఞత చావదేని నీకృతి చిరకాలజీవినగు' నని ఆత్మవిశ్వాసమును ప్రకటించుట సమంజసముగా నున్నది.

# నవ్య నాటకరంగము

గొల్లపూడి శ్రీరామశాస్త్రి

లోకవ్యవహారమునఁ గళ లనంతములుగాఁ గనఁబడుచున్నను జనుల కత్యంతోపకారక ములు అఱువదినాలుగని మనపూర్వులు పరిగణించిరి. వానియందును గానము, కవిత్వము, చిత్రలేఖనము, అభినయము అనునవి ముఖ్యములు. వీనిని లలితకళలందురు. లలితములన మనోజ్ఞములు. వీనులవిందుగ నొకగీతమును వినినపుడును, కన్నులపండువుగ నొకదృశ్యమును గాంచి నపుడును మనసున కానందము గలుగును. కనుకనే లలితకళలపరమార్థ మానంద మనుట.

అభినయ మనునది లలితకళలలో నొకటి. అవయవములకదలిక మొదలగువానిచేఁ దెలియఁజేయఁదగిన విషయమును దెలుపుట యభినయము. దీనికి వ్యంజకమనియు నామాంతరము. విషయమును వ్యక్తపఱచునది వ్యంజకము. అభినయముచే శృంగారాదిరసముల కాశ్రయులైన నాయకనాయకులయునికిని అనుకరించుట నాట్య మనఁబడును. అనఁగా సుఖదుఃఖములతోడి దగు లోకస్వభావము ఆంగికాదులగు నభినయములతోఁ గూడినపుడు నాట్య మనిపించుకొనును. నాటకమందలి కథను బాహ్యజగత్తునకు సాక్షాత్కరింపఁజేయుటయే నాట్యకళాకృత్యము.

భరతముని గ్రంథారంభమున నొనరించిన ప్రస్తావన నాట్యప్రశస్తిని వేనోళ్లఁ జాటుచున్నయది. దేవతలు బ్రహ్మదేవునికడ కేగి దృశ్యము, శ్రవ్యము నగు క్రీడనీయక మొకటి యనుగ్రహింపుమని వేడిరి. చతుర్ముఖుఁడు దేవతలవేడికోలు నంగీకరించి చతుర్వేదాంగ సంభవము, సార్వవర్ణికము నగు నాట్యవేదమును బ్రసాదించి ఇయ్యది ధర్మ్యము, బుద్ధివర్ధనము, ఉపదేశజననము, వినోదకరణము అని వాక్రుచ్చెను. ఈబ్రహ్మోపదేశమునె తరువాతిమహాకవులును లోకమున కుపదేశించిరి.

ఒక్కొక్కలలితకళయు నానందప్రదమన పెక్కుకళలమేళగింపుచేఁ గలుగు నానంద మమేయమనక తప్పదు. నాటకప్రదర్శనమందు నభినయకళయే ముఖ్యమయ్యు కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము అనువానికిని అవకాశము గలదు. నాటకప్రదర్శన మన లలితకళల ప్రదర్శన మనుటయు నొప్పును. కనుకనే వేఱువేఱు రుచులుగలజనుల కెల్లరకు నాట్య మానందప్రదమని నుడివిరి.

మహాప్రవక్తలును తమ జీవితకాలమెల్ల వినియోగించియుఁ జేయఁజాలని సంఘసంస్కరణము నాట్యరంగ మల్పకాలములోఁ జేయఁజాలును. ఆరంభదశలో భారతీయనాటకము లేమి, పాశ్చాత్యనాటకము లేమి మతబోధకములుగా నుండినవనియే విజ్ఞులసిద్ధాంతము. ప్రతిభావిశారదులగు నాటకప్రవక్తలు తమయుద్యమము లక్రమంబుగాఁ గొనసాగుటకుఁ బన్నిన పన్నుగడయేమో యిది యని తోఁచె[illegible]స్వా మొదలగు విదేశములయందు రాజకీయవిషయములు పయిఁతము రంగములఁ బ్రదర్శింపఁబడుచుండెడి వనియు, తన్మూలమున నాదేశము

లచిరకాలముననే యభివృద్ధికి వచ్చినవనియుఁ దెలియుచున్నది. ప్రకృతము డబ్బుఇచ్చి చూడఁ బోయినవారు రెండుకన్నులతోనైనఁ జక్కఁగా చూచెదరో లేదో కాని, మన దొరతనము వారుమాత్రము నాటకప్రదర్శనములను వెయ్యికన్నులతోఁ గనిపెట్టియుండుట మనమెఱుఁగనిది కాదు. జనులచిత్తములయందు నూతనభావముల నంకురింపఁజేయుటలో నాట్యరంగ మందె వేసినచేయి.

మన నాట్యరంగము నేఁటి ప్రజాజీవితమునకు సర్వవిధములఁ దోడ్పడవలయునన్నఁ దొలుత నాటకరచనలో సంస్కరణ మావశ్యకము. నేఁటివఱకు వెలువడిన యాంధ్రనాటకము లలోఁ బెక్కులు నిర్జీవములు. ఇప్పటి యసంఖ్యాకనాటకము లన్నియు నేరెండుమూఁడు నాటకముల యనుకరణములో యనఁదగినస్థితిలో నున్నవి. కనుకనే యీనాటకములలో నౌచిత్యము పూర్ణానుస్వారమైనది. అనౌచిత్యభాజనములగు నాటకప్రదర్శనములు పరిహాస భాజనము లగుటలో వింత లేదు.

లౌకికప్రపంచమునందువలెఁ గావ్యప్రపంచమునందును ఒక్కొక్కవిషయమునను ఔచిత్యమునకే యగ్రతాంబూలము. నాటకకర్త కథాసంవిధానమందేమి, పాత్రపోషణమునం దేమి ముఖ్యముగఁ బాటింపఁదగినది యౌచిత్యమే. రససిద్ధమైన కావ్యమునకు జీవిత మౌచిత్యమనియు, అనౌచిత్యమునకంటె రసభంగహేతువు మఱొకటి లేదనియు ప్రాచీనాలంకారికుల యాశయము. శాస్త్రములో కాద్యనుభవములఁ బురస్కరించుకొని విభావాద్యౌచిత్యము నుచితరీతిఁ బోషించినచో నాటకము శోభాకరముగ నుండును.

పూర్వులు నాటకరచన కొసఁగినగౌరవము నేఁడు తల్లక్రిందైనది. వారు 'నాటకాంతం కవిత్వ'మన్నారు. ప్రకృతము 'నాటకాద్యం కవిత్వ' మైనది. ఇప్పటి నాటకకర్తలకు ప్రాఁత కొఁత. (అందలిరహస్య మిది: అనిష టు మసగతమునుటనుఁ దగినయవకాశము లేకపోవుటయే) క్రొత్తయేమో తెలియదు. రథమేమో నిలువకూడదు. దీనికిఁదోడు నిరుద్యోగసమస్య యొకటి.

ఒక చిన్నవిషయము: కడచినవత్సరము మాన్యూలులో ఆఱవఫారము చదివినయువకుఁడు, శెలక్షను కాకపోవుటచే ఆవత్సరము అతఁడు పరీక్షకు పోలేదు. చదివి ప్రయోజన మేమని యావత్సరము చదువే మానివేసెను. శెలక్షను కాకపోవుట తెలుఁగుమార్కులు తక్కువ యయి కాదు. అతఁడు చాల కుదురైనవాఁడగుటచే నతనిపట్ల నా కభిమానముండుట సహజము కదా. పూర్వజన్మసంస్కార విశేషమువలనఁగాఁబోలు, అతనికి తెలుఁగుక్లాసన్న చాలఇష్టము. క్లాసులో జరుగుపాఠములను విడిచియు నేవో తెలుఁగుపుస్తకముల నప్పుడే చదువుచుండెడి వాఁడు. ఈవత్సరారంభమున, అనఁగా చదువు మానివేసినవెంటనే భాషాజ్ఞాన మలవడుటకై చదువవలసిన పుస్తకములఁగూర్చి నన్ను సలహా అడిగినాఁడు. తరువాత కొంతకాలమునకు మనుచరిత్రములో షష్ఠాశ్వాసము పూర్తిచేసినాననికూడ చెప్పినాఁడు. ఇటీవల నొకటిరెండు పత్రికలకు వ్యాసములేమో వ్రాసినట్లును నుడివెను. మఱచితి—గణాలుకట్టడముగూడ నేర్చుకొన్నాఁడఁట. ఇది యతనిచరిత్రము.

ఆయువకుఁడు వారమువినములక్రిందట నాకుఁ గనఁబడి చెప్పినమాటలు: 'సార్ మొన్నటి ఫిబ్రవరి భారతిసంచికలో నాట్యకళాపరిషత్తువారు నాటకపోటీపరీక్షనుగూర్చి

వ్రాసినదానిని చూచినారా ? నాటకమునకు వెయ్యిరూపాయలు బహుమానమిస్తారట. నాటకము ప్రోజులో నే ఉండవచ్చునట. మనము మాట్లాడే భాషలోనే నాటకమంతా వ్రాయ వచ్చునట. నేనుగూడ సోషల్ డ్రామా ఒకటి ఆరంభించి రాస్తున్నాను. మీ హెల్పుగూడ నాకు ఉంటుందిగదా అని నాకు చాలా ధైర్యము.' మొదలగునవి. ఆయువకుని కడపటిమాట మాత్రము భావకవిత్వములో చేరినది. కనుక ముఖాముఖి మాటలాడిన నేను దానికి ఇంచుక వ్యాఖ్యానము చేయకపోయినచో అపార్థమున కవకాశము గలుగును. కడచిన నాట్యకళా పరిషత్సందర్భమున జరిగిన సంతర్పణములో సర్వవిధములఁ బాల్గొన్నవారిలో నేనొకఁడను. అది యెట్లో అతనిచెవిఁ బడినది. కనుక బహుశా... ఉండవచ్చునేమో అన్నతలంపుతో అనిన మాటయని నేను గ్రహించితిని. అది యటుండనిండు. నాటకబహూకృతినిర్ణాయకసంఘ సభ్యులహస్తముల నలంకరించునాటకములలో మాప్రియశిష్య విరచితనాటకరాజముగూడ నొకటియని తెలుపుట కెంతయు గర్వపడుచున్నాఁడను. అదృష్టవంతుని చెఱచువారుండ రండురు. ఒకవేళ నతనినాటకమునకే బహూకృతి వచ్చుభాగ్య మబ్బెనేని అందు నేనును భాగస్థుఁడనే; ద్రవ్యములోఁగాదు, గౌరవములో.

నేఁటి నాటకగౌరవమునకు నిదర్శనముగ నియ్యది నుడివితిని క్షమింతురుగాక. ఆంధ్ర నాటకకర్తలు మన జన్మహక్కుగు సంస్కృతనాటకవాఙ్మయము నొక్కపరి పరిశీలించి నాటకరచనకుఁ గడంగుట ముఖ్యకర్తవ్యము. భారతీయనాట్యకళ యుచ్చదశలో నున్నతఱి వెలువడిననాటకములు, తత్ప్రదర్శనములు పరిశీలించి నాటకము సర్వాంగసుందరముగా నుండు టకై ప్రతిభావిశారదులగు ఆలంకారికులు చూపినపద్ధతు లెల్ల ప్రకృతము గ్రాహ్యములు గావనుటకంటె నవిచారమూలకము మఱొకటి యుండదు !! కవులు నిరంకుశులు అను నుడి నేఁటిదికాదు. ఉత్తమకవులకు లక్షణము లెన్నండును పాశములు గానేరవు. ప్రాచీన లక్ష్య లక్షణములఁ బరిశీలించి, వానితోడ్పాటునఁ దమ ప్రతిభావిశేషమును జూపుటయే యుత్తమ కవుల లక్షణము.

పూర్వలాక్షణికులు ఇతివృత్త భాగములని ముఖాదిసంధులు, తదంగములు వివరించి వీని ప్రయోజనము నాటకమునందలి కథాభాగమునకుఁ బ్రశస్తిని సంపాదించుటయే అని నుడివిరి. అంతియ కాదు: సంధ్యంగములు మొదలగువానికి రసాభివ్యక్త్యపేక్షచే నాటకమునం దవకాశ మొసఁగవలయుఁగాని బలవంతమాఘుస్నానము తగ దనిరి.

మఱియు వధ, యుద్ధము, భోజనము, చుంబనము, స్నానము మొదలగువాని ప్రదర్శ నము రసాపకర్షక మగుటచే నిషిద్ధమని సూచించిరి. పూర్వులు నిషేధించిన వన్నియు నేఁటి నాటకరంగములఁ బ్రదర్శింపఁబడుచు వారి యనుభవజ్ఞానమును వేనోళ్లఁ జాటుచున్నవి. మఱియు, ఒకయంకమున ననేకదినచర్య ప్రదర్శించుట రసపోషకము గాదని పూర్వుల యభి ప్రాయము. సంపూర్ణరామాయణాదినాటకప్రదర్శనములఁ గాంచిన నేఁటిబుద్ధిమంతుల యభి ప్రాయమును వేఱుగ నుండనేరదు. నాటకమున నొకరసము ప్రధానముగను, తక్కినవి యంగ ములుగను ఉండవలయునని పూర్వులయాశయము. నేఁటిప్రదర్శనములు పెక్కులు బీభత్సము లగుటకు కారణము ఆనాటకకర్తలు తమ నాటకములు సంపూర్ణ నవరసభరితములుగనుండ

కెంచుటయే యని తెలియుచున్నది. నాటకమునందు శృంగారవీరములలో నొకరసము ప్రధానముగ నుండుట ప్రశస్తమనిరి. అందులకుఁ గారణము ఆ రెండురసములే సర్వజనాహ్లాదకరములు, మీదుమిక్కిలి లోకమునుత్పత్తిస్థితులకు హేతువులు నగుటయే. పూర్వలాక్షణికుల యభిప్రాయముల నిట్టివానిని గొన్నింటినైన మనమునం దుంచుకొని నాటకరచనకుఁ గడంగుట ముఖ్యము.

నేఁటినాటకప్రదర్శనములు పెక్కులానందదాయకములు, నాదర్శభూతములు గాక పోవుటకు ముఖ్యమైనకారణము మఱియొకటి కలదు. నాట్యమునకు శరీరమువంటిదగు నాటకేతివృత్తము నేఁటి ప్రజాజీవితమునకుఁ గొంతకుఁగొంతయైన సంబంధించియుండకపోవుట. ప్రాచీననాటకములఁ బరిశీలించినచో నందుఁ దాత్కాలిక ప్రజాజీవితము ప్రతిఫలించుచుండును. ఇంతవఱకు వెలువడిన యాంధ్రనాటకములలో ముప్పాతికమువ్వీసము ప్రాచీననాటకానుకరణములేకదా. తద్భిన్నములు గొన్ని లేకపోలేదు. కాని, యవి పాశ్చాత్యనాటకానుసరణములు. ఇవి మన సొంతములు అనుకొనుభాగ్య మింకను చక్కఁగా మనము నోచుకొనమైతిమి.

నాఁటి నేఁటి ప్రజాజీవితములోఁ గల్గిన మార్పులను నవ్యనాటకకర్తలు ముఖ్యముగ గమనింపవలయు. దేవతాసాక్షాత్కారములు, తన్మూలమునఁ గార్యసిద్ధులు అనునవి నేఁటి హేతువాదప్రవాహమునఁ గొట్టుకొనిపోయినవి. నావిష్ణుః పృథివీపతియన్న భావ మడుగంటుటచే రాజులయు, రాణులయుఁ గథలు అవ్వకథలైనవి. ఇవి స్వయంరాజా, స్వయంమంత్రి యను రోజులు. ఇఁక ప్రాతపద్ధతులు పాటికెక్కవు.

నాటకనాయకుఁడు ఉత్తముఁడుగ నుండవలయునని ప్రాచీనుల యభిప్రాయము. నవ్యనాటకములలోను అట్లుండుటయే సమంజసము. అయిన ఆయుత్తముని జీవయాత్రలో పూర్వభాగప్రదర్శనమే సామాజికశిక్ష కత్యంతోపయుక్తము; విశేషించి శోభాకరమును. చిల్లరదుకాణదారుఁడగు సుబ్బిశెట్టి జీవితప్రదర్శనమువలనఁ గలుగులాభమే, దివాన్‌బహద్దర్ సుబ్బయ్యశ్రేష్ఠిగారి నిరతిశయైశ్వర్య ప్రదర్శనమువలనను గలుగును. మొదటిది నిస్సారము, రెండవది నిష్ప్రయోజనము !! ఇఁకేమన, శెట్టి శ్రేష్ఠిగారగుటకుఁ బడినపాటుల ప్రదర్శనమే శోభాకరము, ఆదర్శప్రాయమును. విశ్వామిత్రుని పూర్వచరిత్రప్రదర్శన మెంతటి ముదావహమో సహృదయైకవేద్యము.

విధి, అదృష్టము, ప్రారబ్ధము మొదలగువానియెడఁ గల మూఢవిశ్వాసము అంతరించి పౌరుషముపై నాధారపడినఁగాని మనకు మోక్షములేదని శ్రీ వివేకానందస్వామి చాలకాలము క్రిందటనే సెలవిచ్చెను. దానినే ప్రకృతము మహాత్మాజీ పదేపదే వల్లెవేయుచున్నాఁడు. పరమేశ్వరాంశసంభూతులగు మానవులలో నొక్కొక్కనియందు ననంతశక్తులు గలవు. కనుక నొక్కొక్కఁడును ఉన్నతస్థాన మలంకరించుట కవకాశము గలదు అను ప్రబోధము జనుల మానసక్షేత్రముల నాటుకొని ఫలోన్ముఖ మగుటకు నాటకరంగము తోడ్పడవలయు.

# మాతృప్రేమ

[ఏకాంకనాటకం]

## పా. వే. రాజమన్నారు

[మేడమీద గది. విశాలంగానే ఉంది. ఒకమూల మంచం. మంచానికెదురుగోడంతా అద్దాల కిటికీలు. కొన్ని తెరువబడి, కొన్ని మూసి ఉంటవి. మంచానికిప్రక్క బల్ల, బల్లపైన మందు సీసాలు, గ్లాసులు వగైరా.

కాలం సాయంత్రం, రంగం నడిచేకొద్దీ చీకటి పడుతుంది.

మంచంమీద వేణుగోపాలరావు పడుకున్నాడు. వయస్సు 30 కి మించి లేదు. దీర్ఘరోగ పీడితుడని అతని దౌర్బల్యమే చెప్పుతూవుంది. అయినా ముఖములో తేజస్సుంది. కళ్లల్లో కాంతి అప్పుడప్పుడు ప్రకటన అవుతుంది. బాధచేత బొమలు పైకెత్తినప్పుడు విశాలమైన నుదుట ముడతలు కనబడతవి...

వేణు ఒంటరిగా చూస్తున్నాడు కిటికీగుండా అస్తమయ సౌభాగ్యం. ప్రవేశం రామలక్ష్మమ్మ, అతని తల్లి. విధవరాలు, అయినా జుట్టుంది. నున్నని నల్లనివెంట్రుకలలో అక్కడక్కడ జరీపోగులు కలిసిఉన్నవి. గాంభీర్యమూ ఉంది, సౌలభ్యమూ ఉంది ఉనికిలో, చేష్టల్లో, చూపులో.]

రామ.

నాయనా! ఆరు వేశారు. మందు పుచ్చుకోవూ? (బల్లదగ్గిర గ్లాసులో ఒక సీసానుంచి మందు వంచబోతుంది.)

వేణు.

(కొంచెం దీనంగా) అమ్మా!

రామ.

ఏమి నాయనా!

వేణు.

వద్దే. ఇవ్వేళ మందువద్దే...చూడు! నీకేమీ పనిలేకపోతే ఇక్కడే కొంచెంసేపు కూర్చో...నాకేమీ తోచడంలేదు.

రామ.

అలాగే నాయనా! (ప్రక్కగ కుర్చీవేసుకొని కూర్చుంటుంది. కొంతసేపు ఇద్దరూ మాట్లాడరు.)

వేణు.

అమ్మా! నాజన్మమంతా ఇంతే కదమ్మా.

రామ.

ఏమి మాటలు నాయనా.

వేణు.

అయ్యో నాకు తెలియదటే...

రామ.

(దుఃఖం ఆపుకొని) నీకేమి తెలుస్తుందిరా. మనడాక్టరుగారు చాలా గొప్పవారంటారు. నీమీాద ఎక్కువ ఇష్టంకూడాను. త్వరగా లేచి తిరుగుతావులే నాయనా.

వేణు.

(కొంచెముసేపు ఊరుకొని) అమ్మా! శారద పాపం చాలా కష్టపడుతూ ఉందికదూ నామూలాన్న.

రామ.

(అనాలోచితముగా) అబ్బే ! లేదు నాయనా.

వేణు.

ఆఁ అదీ దొరికావు. అదేనమ్మా నిన్నడగాలని. నీ అభిప్రాయం చెప్పక పోతే ఒట్టు...

రామ.

ఎందులో ?

వేణు.

శారద విషయంలో.

రామ.

(స్వల్పంగా చలించి) అంటే ?

వేణు.

శారదలో మార్పు కనబడుతూ వుంది, కొన్నాళ్లగా...నాలుగైదు మాసాలుగా. నాకు జబ్బుచేసిన మొదటిరోజుల్లో అబ్బా! ఏమి ఏడ్చేది... రోజుకు ఒక్కసారైనా అన్నం ముట్టుకునేదికాదు కదూ! జ్ఞాపకం లేదూ?

రామ.

ఊఁ.

వేణు.

డాక్టరుకూడా వకసారి మందలించాడు "ఇదటమ్మా పతివ్రతాధర్మం. పలికి పరిచర్యచెయ్యడానికైనా ఒంట్లో సత్తువఉండవద్దటమ్మా" అని.



పాపం, రోజు రాత్రిళ్లు నేను నిద్రించేవరకు ప్రక్కనే కనిపెట్టుకుని ఉండేది. అవునా ?

రామ.

అవు నిదంతా ఎందుకునాయనా ఇప్పుడు !

రామ.

(వినిపించుకోకనే) నాకు చాలా జాలివేసేది. ఆకుసుమసుకుమారమైన దేహం కృశించిపోవడం చూసినప్పుడు నామీద నాకు కోపంవచ్చేది. కారణం నా వ్యాధికదా అని...ఆ లేడికళ్లల్లో నీళ్లు గిర్రుమని తిరిగితే నాకడుపులో చేతులువేసి కలబెట్టినట్లు బాధపడేవాడిని...

రామ.

(ధోరణి త్రిప్పేయడానికి) చీకటి పడుతోంది. దీపం వెయ్యనా ?

వేణు.

వద్దు, వద్దు...విందూ...అలా ఉండేదా, మన సత్యం పరీక్షలు కాగానే

వచ్చినప్పుడు చూచి ఆనవాలుకూడా పట్టలేకపోయాడు...అతరువాతేకదూ నేనుకూడా మందలించి ఇంతచిన్నతనంలో, ఎల్లప్పుడూ రోగిదగ్గిరనే ఉంటే తప్పు అని ఇతరవిషయాల్లో కొంచెం ఆసక్తి తీసుకొనేటట్టు చెయ్యరా మీ వదినగార్ని అని సత్యంతోకూడా అన్నాను.

రామ.

వేణూ ! ఏమి టీపురాణం !

వేణు.

పోనీలే ! నీఆశ ఇంతే.

రామ.

(దుఃఖం ఆపుకొని) పిచ్చితండ్రీ...

వేణు.

(తటాలున ఏడుస్తూ) అంతా మారిపోయిందమ్మా శారద!...

రామ.

అయ్యయ్యో! ఏడు పెందుకునాయనా. ఛీ! ఊరుకో...

వేణు.

మెల్ల మెల్లగా నాదగ్గిరికే రావడం మానేసింది...రోజు కొక్కసారి కూడా రావడంలేదు. విచారంలేదు. పోనీ అనుకున్నాను. విసుగుకూడానూ ......మొన్న ఆరోజ్‌పట్టుచీర కట్టుకుంటే పూచిన గులాబీపువ్వువలె కన బడింది...కండ్లకోర్కె తీరాచూచి ఆనందించడానికైనా పట్టుమని పదినిమి షాలు ఉండమంటేకూడా ఉండలేదు...సినీమాకు వెళ్లిపోయింది.

రామ.

చిన్నతనం నాయనా.

వేణు.

అమ్మా ! అమ్మా ! నీవుకూడా ఈ ఇచ్చకాలేకదూ పలుకుతావు ? ఇందుకనేనా నీతో చెప్పకున్నది.

రామ.

అదికాదురా ! శారద పసిపిల్ల, సరదామనిషికూడాను. ఎన్నాళ్లు కృశిస్తూ ఉంటుంది? ఎప్పుడైనా అలా షికారు వెళ్లుతుంది.

వేణు.

అది తప్పన్నానా, నేనేగా పొమ్మన్నది...కాదు. అంతమాత్రానికి ఇంత క్రూరంగా బాధపడతానా...కాదుకాదు...(గద్గదస్వరంతో) అదికాదు... శారదకు నామీద ప్రేమే పోయింది.

రామ.

ఛీ! ప్రేమ లేవిట్రా...నాటకాల్లో కావ్యాల్లోలాగ......ఇంకేవైన మాట్లాడుకుందాంరా...లేదా గ్రామఫోను విందువుగాని.

వేణు.

వద్దు వద్దు నాకు సంగీతం వింటే ఒళ్లంతా మండుకుపోతుంది. వద్దు... అమ్మా...అమ్మా!...ఏమనుకోవుగదూ నేనొకమాట అంటే...ప్రేమంటే ఆక్షేపించావు. అయితేచెప్పు, నాయన నిన్ను పెళ్లాడినట్లేనా నేను శారదని పెళ్లాడింది...నాయన నీవెవరో తెలియకుండానే మూడుముళ్లువేశాడు...నేను శారదను కోరి ప్రేమించి అనురాగంతో వివాహంచేసుకున్నాను ..

రామ.

ఇప్పుడుమాత్రం ఏమినాయనా. ప్రేమ ఎక్కడికి పోతుంది?

వేణు.

లేదమ్మా, లేదు. నే నెరగనూ? ప్రేమ నశించిపోయింది...శారదకు నామీద ప్రేమ నశించింది...నాజీవితంలో ఆనందలక్ష్మి వెళ్లిపోయింది... నాహృదయాకాశంలో ఇప్పుడు చంద్రుడు లేడు...నిండు అమావాస్య...

రామ.

నేనేమిచెప్పను, నీ వంతపిచ్చిగా మాట్లాడుతూ వుంటే?

వేణు.

(అమ్మచేతులు గట్టిగ పట్టుకొని, గద్గదస్వరముతో) అయితే... అమ్మా! అమ్మా!...ఒకవేళ శారద ఇంకొకణ్ణి ప్రేమించినట్లు తెలిసిందా. అబ్బా...ఓర్చుకోలేను...ఆపుకోలేను...అప్పుడు నార క్తనాళాల్లో రక్తం ప్రవహించదు...అగ్నిజ్వాలలు పరుగెత్తుతవి. ఆబాధ పడలేను.

రామ.

(ఆ పరధ్యానంలో ఎంత ఆలోచన ఉందో ఎవరికి తెలుసును. తటాలున చిరునవ్వుతో) ఛీ! ఎంతవెర్రిరా, అబ్బాయి, ద్రోహంకూడాన్ను అలా భావించడం...నిజంచెప్పనా!

వేణు.

చెప్పు, చెప్పు, త్వరగా చెప్పు.

రామ.

ఇదంతా నాతప్పే...శారద అలా విచారంగాఉంటే నీవు బెంగపెట్టుకోవడం చూచి డాక్టరు నాతో అన్నాడు: "మీరెట్లాగన్నా ఆవిడను కొంత

సరదాగా ఉండేటట్లు చెయ్యాలి...అప్పుడుగాని అబ్బాయికి శాంతి ఉండదు. శాంతిఉంటేగాని మందులు పనిచెయ్యవు" అని. అందుచేత మేమందరమూ చిలకకు చెప్పినట్లు చెప్పి బ్రతిమాలి ఆవిణ్ణి మెల్లమెల్లగా నీదగ్గిరే ఉండకుండా చేయించాము...పాపం! అదేమి చెయ్యగలదు.

వేణు.

నిజంగా? నిజంగా! కల్పిస్తున్నావు.

రామ.

పోనీలే! నమ్మకపోతే.

వేణు.

కాదే. నిజంగానా అని సంతోషంచేత అడిగానే .....(కండ్లుమూసుకొని) అబ్బ! ఎంతకష్టపడ్డాను. ..

రామ.

పిచ్చినాయన...కొంచెం పాలుపుచ్చుకో. (పాలు త్రాగిస్తుంది.)

వేణు.

(త్రాగి) అబ్బబ్బ! (అని గుండెపట్టుకొని) చాలా బాధగా ఉందమ్మా! ...ఏదీ! ఏదీ! డాక్టరుగారు ఇస్తాడే ఆ నిద్రమందు...ఇచ్చేయవే...

రామ.

(గబగబా ఆ సీసా వెదకి గ్లాసులో పోస్తుంది.)

వేణు.

అబ్బా! ఘోరంగావుందే బాధ.

రామ.

(చేతులు తడబడినవిగాబోలు వేగముగా చుక్కలు పడ్డవి గ్లాసులో. గ్లాసు నోటివద్ద పెట్టి త్రాగించును.)

వేణు.

(త్రాగిన రెండునిమిషాలకు నిశ్శబ్దము. తల్లి వేణును రెప్పవాల్పకుండా చూస్తూవుంది. వేణు కండ్లుమూసుకుంటాడు. రామ అలాగే చూస్తూవుంది.)

(తలుపు చప్పుడు)

రామ.

(అదిరిపడి) ఎవరు?

[తెరలో]

డాక్టర్ని.

రామ.

రండి.

(ప్రవేశం డాక్టరు గుప్తా)

నిద్రపోతూవున్నాడు...ఇప్పుడే మీరిచ్చిన నిద్రమందిచ్చాను చాల బాధపడుతూవుంటే.

డాక్టరు

ఆఁ బాగా నిద్రపోతున్నట్టుంది...(కొంత అనుమానిస్తూ) రామలక్ష్మమ్మగారూ! ఎవరూ లేరు గనక...ఒకగొప్ప సందర్భం తటస్థించింది... చెప్పకతీరదు.

రామ.

(లేచి) ఏమిటది?

డాక్టరు

మీరు మీకోడల్లో మార్పు ఏమైనా కనిపెట్టినారా?

రామ.

(తల ఊపును.)

డాక్టరు

అనుకున్నాను. మీవంటి సూక్ష్మజ్ఞులకు కష్టంకాదు...మళ్లీ అడుగుతాను...నేను చెప్పేమార్పు ఏమిటో అర్థంచేసుకున్నారా...

రామ.

ఆఁ, శారద...సత్యం...

డాక్టరు

అంతేకాదమ్మా.

రామ.

(నిట్టూర్చి) అబ్బా! డాక్టరుగారూ! తెలుసును...మూడవనెల...

డాక్టరు

(నమస్కరిస్తూ) క్షమించండి...మూఢుణ్ణి. అబ్బాయికి తెలిస్తే ఈ రోగబాధతోకూడా మనోవేదన ఎలా సహిస్తాడు! ఎంతఘోరము! భరించడానికి శక్తికూడా లేదే.

రామ.

(కండ్లనుండి నీళ్లు ధారలుగా ప్రవహిస్తూవున్నవి.) అబ్బాయికి ఆబాధ తప్పిపోయింది.

డాక్టరు

ఆఁ, ఆఁ. (అప్పుడు హఠాత్తుగ వేణుచెయ్యి పట్టుకొంటాడు. నాడి దొరకలేదు.) ఎప్పుడు? ఎప్పుడు...ఏమైంది?...

రామ.

(ఏడుపు బిగబట్టి ఆపి) నిద్రమందు...చుక్కలు...ఎక్కువైనవి.

డాక్టరు

(అంతా స్ఫురిస్తుంది) ఆఁ ఆఁ...ఎంతధైర్యము !.





[తెరలోనుంచి వినబడుతుంది మెల్లెక్కివచ్చు శారదాసత్యనారాయణుల సంభాషణ.]

శార:—ఎంత అద్భుతంగా ప్రకటించిందోయి భావాలు ఆగ్రేటాగార్బొ.

సత్య:—అబ్బో ఫిల్ముల్లో ఆసక్తి ఎక్కువవుతూవుందే.

శారద:—పోదూ వేళాకోళం.

[రామలక్ష్మమ్మ డాక్టరు ఒకరినొకరు చూచుకొంటూ నిలబడతారు. రామలక్ష్మమ్మ కన్నీళ్లధారమాత్రం ఆగలేదు.]

[ తెర ]

# ఆప్త మరణము

## ద్రోణంరాజు చినకామేశ్వరరావు

(ఏకాంకము)

ఇందువచ్చు ప్రాణబంధువులు (పాత్రలు)

తాతయ్య......వృద్ధుడు.
మహాలక్ష్మి......తాతయ్య చిన్న కూతురు.
చలపతి......... ,, ,, అల్లుడు.
విశాల......... ,, ,, మనుమరాలు.
నరసమ్మ........ ,, పెద్దకూతురు.
వెంకప్ప......... ,, అల్లుడు.

[ఒక చిన్నగది: ఎడంప్రక్క గోడకి కిటికీ ఉంటుంది. దానిదగ్గర ఒకసోఫా. రెండో ప్రక్క ఒకకుర్చీ వేయబడి ఉంటుంది. వెనుకగోడకి గుమ్మం, తలుపులు ఉంటాయి. గుమ్మానికి కెడంవేపు ఊడిఊడిపోతూఉన్న డ్రాయరుబల్ల ఉంటుంది. గదికి మధ్యగా ఒకబల్ల— దానిచుట్టూ కుర్చీలు. గోడకి ఒక పొడుగుబల్ల బొమ్మలతో ఉంటుంది. గోడప్రక్కని కొత్తవి కాలిజోళ్లజత ఉంటుంది. మధ్యగాఉన్న బల్లమీద కొన్ని వార్తాపత్రికలుంటాయి.

తెరతీసేటప్పటికి మహాలక్ష్మి బల్ల సర్దుతో ఉంటుంది. చేతికొక్క గాజులజత తప్ప మరేమీఉండవు. మొగానికి బొట్టుండదు. ఒక్కనిమిషమాలోచించి కిటికీ దగ్గరకెళ్లి, తలుపులుతీసి కేకేస్తుంది. బయట పిల్ల లాడుకుంటున్న కేకలు విని పిస్తుంటాయి.]

మ:—విశాలా, విశాలా! వినపడటంలేదూ, వెధవఆటలూ నువ్వూనూ? వస్తావా, రావా? (కిటికీతలుపులేసేసి మళ్లీ బల్లదగ్గిరకొచ్చి తెల్లగుడ్డపర్చి పూలగ్లాసు అమర్చి సర్దుతో ఉంటుంది. విశాల పదేళ్లపిల్ల; అందమైన కొత్తబట్టలుకట్టుకొని వస్తుంది) నీకేం బుద్ధి ఉందా లేదా? పదేళ్లు వచ్చి, ఆమాత్రం తెలియదూ? నిన్నుచూస్తే వొళ్లుమండుకుపోతోంది!

వి:—నేనేం చేశానే?

మ:—వీథిలో, ఆగెంతులేమిటి, ఆకేకలేమిటి?

వి:—పిల్లలంతా ఆడుకుంటున్నామే!

మ:—తాతయ్య చచ్చిపోయి, మేడమీద కొయ్యలాగపడిఉంటేనూ, నీ కాటలా? ఇంత మందమతేమే? ఎప్పుడూ శుభ్రమైనబట్టలు కట్టుకోవుగాని, ఇప్పుడొచ్చిందేం ఈఅలంకార మంతా?

వి:—ఆపిల్లలంతా కట్టుకొమ్మన్నారే!

మ:—వాళ్ళకేం, అంటారు. వాళ్లతాతయ్యేమన్నా పోయాడా? మీదొడ్డమ్మ, బాబాయి వస్తారు. వాళ్లుచూస్తే యేమన్నా అనుకోరూ? లోపలికెళ్లి అవితీసేసి మాసిపోయినవి కట్టుకో.

వి:—ఎప్పుడొస్తారే? ఇదివరకెప్పుడేనా వచ్చారా?

మ:—ఇప్పుడే వస్తారు.

వి:—ఎందుకే?

మ:—తాతయ్యపోయాడు కాదూ? అందుకోసం.

వి:—తాతయ్యపోతే వాళ్ళకేం?

మ:—వ్యాపారాలు ఫైసలుచేసుకోడానికి.

వి:—తాతయ్యపోతే వ్యాపారాలుంటాయా యేమిటే?

మ:—ఉంటాయి.

వి:—నాన్నపోతేకూడా ఉంటాయిటే?

మ:—ఏడిశావు, వెధవమాటలు! నోరుముయ్యి!!

వి:—వాళ్లకెలా తెలిసిందే?

మ:—మీనాన్న టెలిగ్రాంకొట్టారు. (చప్పుడౌతుంది) అయ్యో, రామా! అప్పుడే వచ్చేశారేమో! (తలుపుదగ్గిరకెళ్ళిచూసి) నయమే. వాళ్లుకారు, మీనాన్నే! (చలపతి ప్రవేశించును. తగుమాత్రం బొజ్జ, చిన్నగూని, వ్రేలాడుచుండు మీసాలు ఉంటాయి. జరీపంచె పట్టుకోటు చింకిజోడు తొడుక్కుంటాడు. చేతిలోపొట్లము బల్లమీదపెట్టి)

చ:—(మాట్లాడబోవును)

చ:—చచ్చాను ఖంగారుపడి. అంతమెల్లిగా ఎందుకూరావడం? ఓ కేకెయ్యగూడదూ?

చ:—ఏ మొచ్చిందంతచావు? తలుపుతీసేఉంటే పిలవడమెందుకూ? ఏం యింకా రాలేదూ?

మ:—మీకు కనపడటంలేదూ? (కూతురికేసిచూచి) ఏం కదలవేం యింకా? పైకెళ్లి చప్పునకానీ (వి. పోవును. చ. తో) మాఅక్కయ్యా, బావా వస్తే యేమనుకుంటారు? అసలే అన్నింటికీ యెంచుతూంటుంది. మానాన్నచచ్చి నేనేడుస్తుంటే ఆపట్టుకోటు జరీపంచ యేమిటి? ఇప్పుడే కావలసొచ్చిందేమిటీ ముస్తాబంతా?

చ:—అసలు వాళ్లొస్తారుటే? జ్ఞాపకంలేవూ, మీఅక్కయ్యన్న మాటలు? ఇహ మళ్లీ నీ గుమ్మంలో కాలుపెట్టననేగా వెళ్లిపోయింది క్రిందటిమాటు దెబ్బలాడి!

మ:—మరిప్పుడు నాన్నపోయాడుగాదూ! అతనిఆస్తి పంచుకోవాలని వేగీరావు నడకతోటి వస్తుంది. అవసరాని కెంతకష్టంఅయినా పడగలదు, ఎక్కడనుంచొస్తుందో కాని ఆఓపిక! (పొట్లంవిప్పి ప్లేట్లకోసం వెళ్లుతూంటుంది)

చ:—అది అసలు మీవంశంలో ఉన్నదేగా!

మ:—(సర్రునతిరిగి) అంటే?

చ:—అబ్బే నిన్నుగాదంటా! మీనాన్నని. సాజోళ్లెక్కడున్నాయి?

మ:—గాదిక్రిందపారేశాను. ఇంకాయెన్నేళ్లు తొడుగుతారేమిటి, పందికొక్కులకి కూడా పనికిరావడంలేదు. (గోడవారనున్న జతతెచ్చి విచారంతో) నిన్ననే కొనుక్కొన్నాడు. పాపం, ఒక్కపూటన్నా తొడుక్కోలేదు. ఏం అనుభవించాడు? ఇంటినిండా అతని సామానేకదా? పోనీ లెండి. ఇం కాజోళ్లమాటెత్తకండి. ఈకొత్తవి తొడుక్కోండి.

చ:—(తొడుక్కుంటూ) ఇవి బొత్తిగా చిన్నవి. నాకు పట్టవు.

మ:—అన్నింటికీ యిలాగే. చస్తూన్నాను, మీ కమర్చలేక! కాస్త చిన్నవైతేమాత్రం తొడుక్కోకూడదూ?

చ:—ఎలాగే, పట్టనప్పుడు?

మ:—మొదట అలాగుంటుంది కాని అనకానక సాగుతుంది. సరికొత్తవి పారేసుకుంటామా యేమిటి? (ప్లేట్లకోసం వెళ్లబోయి వెనక్కితిరిగి) ఇదిగో, యిలాచూడండి. మానాన్న మొన్నకొన్న కొత్తబీరువా క్రిందికిదింపుకొచ్చి మనగదిలో పెట్టుకుందాం. అతనుపోయాక, దాన్ని మనమే వాడుకుందాం అనుకున్నాంగా?

చ:—మరి మీఅక్కయ్యొచ్చి జగడమాడుతుందేమో!

మ:—అవును. అదొస్తే తగువు పెట్టితీరుతుంది.

చ:—ఆవిడా అదే కావాలంటుందేమో!

మ:—(ఆలోచించి) నాన్నకొన్నాకని రాలేదుగా? దాని కసలు దానిసంగతే తెలియదు. అదిరాకుండానే తీసుకొచ్చి మనగదిలో పెట్టేసుకుంటే, మనదే అనుకుంటుంది.

చ:—(తెల్లబోయి) అంతపనే!

మ:—ఏమి టా తెలివితక్కువ? లేవండి.

చ:—కాస్త ఫలహారంచేసి......

మ:—వెధవతిండి, ఆనకతినొచ్చు. మళ్లీ వా ళ్లొచ్చేస్తారు.

చ:—నాకదేం అక్కర్లేదు.

మ:—అయ్యో తెలివితక్కువా? ఎందుకక్కర్లేదు?

చ:—తెలిస్తే, ఆవిడేమన్నా అనుకుంటుంది. నాకు నచ్చవునుమా, యిలాంటిపనులు!

మ:—అందుకే యిలా తగలడుతోంది కాపరం. మీకు తెలియదు, చెప్పితే వినరు. ఇం కెలాచావను (ఏడ్చును.)

చ:—అబ్బ, యీమాత్రాని కేడుపెందుకు?

మ:—అయితే మరి, మాట్లాడకలెండి. ఈపాత్రడాయరు తీసుకెళ్లి అక్కడపడేసి అది తెచ్చుకుందాం. ఇదే నాన్నదనిచెపుదాం. ఇది మాఅక్కయ్యతీసుకున్నా సంతోషమే. ఎలాగైనా వదుత్తేచాలునని చూస్తున్నాను.

చ:—మరి, మన మీసామాన్లుమోస్తూంటేనే, వా ళ్లొచ్చేస్తే?

మ:—వీధితలుపేసేసొస్తా. ఈలోగా మీరూ కోటుతీసి సిద్ధంగాఉండండి. (వెళ్లును.)

చ:—(జాగ్రత్తగా కోటుతీసి మడతబెట్టి, చొక్కాచినుగులు చూసుకుంటూ తీయబోతూఉండగా)

మః—(ప్రవేశించి) అదికూడా తీసేయకండి.

చః—ఏ అంచైనాతగుల్కొని చిరిగిపోతేనో ?

మః—ఇంకా ఏంచిరుగుతుంది ? నేను ముందు మేడమీదికెళ్లి కుర్చీలు, అవీ దాల్లోంచి తీసేసి సర్దుతోంటా. (అని హడావడిగా వెడుతుండగా విశాల యెదురొచ్చును.)

విః—అమ్మోయి, కాస్త ఈపిన్నీసుపెట్టవే.

మః—మీనాన్నచేత పెట్టించుకో. నాకు తీరుబడిలేదు (పోవును.)

విః—(చ. పిన్నుపెట్టుచుండగా) నాన్నా, కోటు విప్పేశావేం ? ఎంచక్కఉన్నావు, నాన్నా, కోటు తొడుక్కొంటేను !

చః—అది అస్తమానం తొడుక్కోకూడదమ్మా.

విః—తాతయ్య, అలాంటివాళ్లెవళ్లైనాచచ్చిపోతే తొడుక్కోవాలా ?

మః—(పైనుంచి) రారేం, యెంతకీ ?

విః—ఎక్కడికి నాన్నా ?

చః—మీఅమ్మా, నేనూనూ తాతయ్యబీరువా కిందికిసాయంపట్టి తీసుకురావాలి.

విః—దొడ్డమ్మచూడకుండా దాచేస్తున్నారా ?

చః—(తెల్లబోయి) కాదమ్మా. మీతాతయ్య చచ్చిపోయేటప్పుడు దాన్ని మీఅమ్మకిచ్చాడు.

విః—ఎప్పుడూ ? పొద్దున్నే ?

చః—అవును.

విః—పొద్దున్నే తాతయ్య అలా గూగుతూవచ్చాడేం, కల్లుతాగినవాడిలాగ ?

చః—తప్పమ్మా, తప్పు. ఇప్పుడలాగనకూడదు.

మః—(మంచిగడియారము చంకలోపెట్టుకొని తీసుకొస్తుంది.) ఇదికూడా మనదగ్గరే ఉంచుకుంటే బాగుంటుందని తోచింది. మనటైంపీసు పాడయిపోయింది.

విః—అది తాతయ్యది కాదే ?

మః—ఛట్ ! నోరుముయ్యి. ఇప్పుడు మనదే. (మొగుడికేసిచూసి) ముందిదిపైకితీసుకెళ్దాం. లేవండి, సాయంపడదాం. ముందాకొసెత్తండి. (చ. బల్లనెత్తును.) ఒసేవ్, విశాల, దొడ్డమ్మతో టిదేమీ చెప్పకేం. (చ. చెయ్యి నొప్పిపెట్టినట్టు దించివేయును. అదిచూడకుండా బల్లనెత్తబోవును. అది కదలకపోగా చ. నవ్వుచుండును.) వదిలేశారేం ?

చః—ఎంతసేపనిపట్టుకోనూ ?

మః—ఇంతేనా మొగతనం ? ఎత్తండి. (ఇద్దరూకష్టపడి దాన్నిడ్చుకుపోదురు.)

విః—మీ రిద్దరూకలసి, తాతయ్యవన్నీతీసేసుకుంటున్నారా ? (వీథితలుపు చప్పుడగును.)

మః—(లోపలినుంచి) విశాలా, మీ దొడ్డమ్మేమో చూడు. వాళ్లేఅయితే, నే నొచ్చేదాకా తియ్యకు.

విః—(కిటికీలోనుంచి చూసి) అమ్మోయి, వాళ్లేనే.

మ:—(లోపలినుంచే) తలుపులుతీయకు. వాళ్లయిష్టంవచ్చినట్టు కొట్టుకోనీ. (తలుపులు గట్టిగా చప్పుడౌను) గోడజాగ్రత్త. బెల్లూడుతుంది. (మ. చ. వొగుర్చుకుంటూ కొత్తబీరువా సాయంపట్టితెచ్చి యిదివరకు డ్రాయరుండేచోట పెట్టారు. తలుపులు చప్పుడౌతుండును. డ్రాయరుమీదివన్నీ బీరువాపైనిపెట్టుదురు) సమంగాసర్దండి, ఖంగారుపడక. బద్దలైపోతాయి, తలుపుతీయవే, విశాలా. ఉండుండు. ఆచిరిగిపోయినచొక్కా యెక్కడదొరికింది ?

చ:—మామగారుపోయిన దుఃఖం......

మ:—దుఃఖంకూడానూ ! కోటేసుకోండి (అని కోటుతీయును.)

చ:—ఏమిటాఖంగారు ? నలిగిపోతుంది. ముందీచెయ్యి. మేడమీద గోడేమైనాపోయిందా యేమిటి ?

మ:—పోతేపోయింది, వెధవగోడ. ఆమాటేమీరాయెత్తకండి. నే నేమీ అలసిపోయినట్టు లేనుగదా !

చ:—ఆయాసపడకు, మరి.

మ:—ఏడ్చి, ఏడ్చి, అలా ఉన్నాననుకుంటారు. మాఅక్కయ్యని కాస్త కనిపెట్టుతూఉండండి. అదిఅన్నీ నంకతెంచుతుంటుంది. మాట్లాడేటప్పుడు జాగ్రత్త.

వి:—(లోపలినుంచి ) ఈఘడియ నాకు రావడంలేదే !

మ:—ఆఁ, వస్తున్నా. (పేపరొకటి తీసి చ. మీదపడేసి) చదువుతూ కూర్చోండి. వాళ్లకోసం మనం కనిపెట్టుకున్నట్టుగా కనిపించాలి. (పోయి, గడియతీసివచ్చి, బల్లకెడంప్రక్క నిల్చుండును. బండీవాడు సామాన్లుతెచ్చిఉంచును. విశాల, నరసమ్మ, వెంకప్ప ప్రవేశింతురు.)

మ:—(నరసమ్మని కౌగలించుకొని ఏడుస్తూ) నాన్నని మింగేశావేవ్, అక్కయ్యా !

న:—(కళ్లు కుక్కుకుంటూ) ఎన్నాళ్లపట్టే జబ్బుగావుంట ?

మ:—ఎన్నోన్నాళ్లా !

న:—ఏం జబ్బుచేసింది ?

మ:—అబ్బె, జబ్బేలేదే !

న:—మరి ?

మ:—అదే ఎక్కువై పోయిందే.

వెం:—అదృష్టవంతులు, వెళ్లిపోయారు, పెద్దలు.

చ:—ఓ, వారికేం ?

న:—బాగానేఉంది మీమాట ! ఏమంతపెద్దలని ?

మ:—క్రిందటి ఆదివారానికేనే 72 నిండుత ! (కన్నీళ్లుతుడుచుకుని) కూర్చోవోయి, బావా, అలాగే నిలబడిఉన్నావు (బల్లకెడంవైపు నరసమ్మ, కుడివైపు మ. కూర్చుందురు. వెం. సోఫాలో విశాలనిదగ్గిరపెట్టుకుని కూర్చుండును.)

వెం:—ఇదిగో, మాలక్ష్మీ, అంతదుఃఖముకూడదమ్మా. మనమంతా ఎప్పుడోఅప్పుడు... ఆయన అదృష్టవంతులు కాబట్టే అంతసులువుగావెళ్లిపోయారు. మనమైతే...

న:—ఏమి టా వోగాయిత్యపుమాటలు !

మ:—నిజమే. మంచాన్నిబడి, జీర్ణించి జీర్ణించి......

చ:—ఇంతఆలస్యమైందేం, మీరొచ్చేటప్పటికి?

న:—ఏమిటో, తెమిలిరాలేకపోయాము.

మ:—అంత తెమల్లేకపోవడమేమిటే?

న:—నించున్నపాటున రావడానికౌతుందా? గుడ్డా, గుడుసు సద్దుకోవాలా? కాస్త యిల్లు, వాకిలీ చక్కబెట్టుకోవాలా, వద్దా? చెట్టుమీదపిట్టల్లాగ ఎగిరిపోవడాని కవుతుందా గంపెడుసంసారాలున్నవాళ్లకి?

చ:—అవును. కాస్త తెమిలివచ్చేవరకూ ఆయన ఆగకూడదూ? ఈవిషయంలో ఆయన తొందరేపడ్డారు.

న:—ఏం జరిగిందో చెప్పవురూ. డాక్టరేమన్నాడు?

మ:—డాక్టరు వచ్చేదాకాయేదీ?

న:—అయితే, కాసిన్ని మందునీళ్లే పోయలేదూ?

మ:—మందివ్వకపోవాలనా యేమిటి, డాక్టరందుబాటులో లేకపోయాడుగాని?

న:—(ఏడుస్తూ) అయ్యో, నాయనా, పెసరగింజంతమాత్రే కరువైపోయిందోయి నీకూ!

వెం:—తక్షణం పరుగెత్తలేకపోయారూ?

మ:—పరుగెత్తకేం? అంతబుద్ధిలేదనుకున్నావా? ఆయనేవెళ్లారు, డాక్టరు రామారావుగారికోసం. ఎక్కడికో వెళ్లాగన్నారు.

వెం:—పోనీ, ఇంకోళ్లకోసం వెళ్లకపోయారూ? (పెళ్లాంవైపుచూసి) ఏమే?

న:—అవును. ప్రాణంపోతూంటే ఆయనే అన్నమాటేమిటి? గొప్పపొరబాటే జరిగింది.

మ:—నాన్నకి, బ్రతికిఉండేటప్పు డెప్పుడూ ఆయనే వైద్యముచేసేవాడు. అందుకనే చచ్చిపోయేటప్పుడుకూడా ఆయనే చెయ్యాలి. కొత్తవాళ్లకి తత్వం యేం బోధపడుతుంది? వాళ్లలా రారుకూడాను. డాక్టర్లధర్మంఅది. (మొగుడివైపుచూసి) ఏమండీ?

చ:—అవును, ఎలాగొస్తారు?

వెం:—అవును. ఆమాత్రం నీకుతెలియదాయేమిటి? కాని......

న:—చాలా గొప్పపొరపాటేజరిగింది!

మ:—ఏమిటే, అంతతెలివితక్కువగా మాట్లాడుతావు? డాక్టరువచ్చిమాత్రం ఏమిచేస్తాడు, ఊరికేముంచుకొచ్చేస్తుంటే? ఆయుర్దాయంపోస్తాడా?

వెం:—నిజమే. ఆయుర్దాయంపోస్తాడూ?

న:—ఎంతమందిని చూడడంలేదూ, చచ్చిపోయారన్నతర్వాత బ్రతకటం? కొన్ని గంటలయిపోయినా డాక్టర్లు తెలివైనవాళ్లయితే బ్రతికించలేరూ?

చ:—అది నీటిలో మునిగిపోయిన కేసుల్లో. నీతండ్రి దొందులోనూ పడిగాదు చచ్చిపోత!

వెం:—అలాంటిభయ మెన్నడూలేదు. ప్రపంచకంలోకల్లా ఆయనొంటికి పడనివి నీళ్లే. (అని నవ్వును)

కార్యదర్శులు, ఆంధ్రనాటక కళాపరిషత్తు, 1935



గూడవల్లి రామబ్రహ్మంగారు



నీలంరాజు వెంకట శేషయ్యగారు



ముక్తేవి రామానుజాచార్యులుగారు



కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు

న:—ఏమిటది? (ఉరుమును)

వెం:—(తెల్లబోయి క్రుంగిపోవును)

మ:—ఆయన ప్రతిరోజూకూడా నాలుగైదు బిందెలనీళ్లు పరిశుభ్రంగా స్నానంచేస్తూనే ఉండేవాడు.

వెం:—ఎప్పుడైనా ఒకచుక్క యెక్కువైనా......

న:—అది మనకిప్పు డవసరంలేదు.

మ:—తెల్లారిలేచేటప్పటి కతికులాసాగా ఉన్నాడు. ఫలహారంచేసి కాఫీత్రాగాడు. సరదాగా నవ్వుకుంటూ వెళ్ళాడు యిన్సూరెన్సు కడతానని.

వెం:—మంచిదే. అది మాత్రం చాలా అవసరమైన పనే.

న:—అతనెప్పుడూ దూరదృష్టి ఉన్నవాడే. అతనికున్న న్యాయబుద్ధికి భీమాకట్టకుండా యెన్నడూపోడు.

మ:—అక్కడినుంచి అలాగే రైలుస్టేషనుకి వెళ్లి ఉంటాడు. అందుకే సామాను పాటలూ, పదాలూతోటి యింటికి వచ్చాడు. రాగానే "నీకుముందు వడ్డించెయ్యనా, ఆయనవచ్చేదాకా వుంటావా" అని అడిగాను. "నాకేమీ అక్కర్లేదు. పడుకుంటా" నన్నాడు.

వెం:—ఏ మదృష్టం ఏమదృష్టం!

చ:—(లేచి అందరి మధ్యకివచ్చి రహస్యంగా) నేనువచ్చి చూసేటప్పటికి కొయ్యలాగ పడిఉన్నాడు. కాస్తగుడ్డ మొలచుట్టూ ఉందోలేదో!

న:—అవును. అతనికి ముందే తెలిసిఉంటుంది. నామాటే నిజం. ఎవళ్లో ఇదివరకే చెప్పి ఉంటారు. నీతోటేమీ చెప్పలేదూ? అసలు నిన్ను గురుతుపట్టాడా?

చ:—నాతోటి మాట్లాడాడు.

న:—మాసంగతేమైనా చెప్పాడా?

చ:—అబ్బే, లేదు. పడుకొనేటప్పుడు తీసేయడం మర్చిపోయాను. కాస్తజోళ్లు విప్పేద్దూ అని చెప్పాడు.

న:—మనస్సేమీ కుదురుగా ఉండిఉండదు.

చ:—అబ్బె! గోడు సమంగానే తొడుక్కున్నాడే!

మ:—మాభోజనాలయాక, పోనీ అక్కడికే పట్టుకెళ్లి పెడదామని నాలుగూసర్ది, మర చెంబుతో నీళ్లు బీరువా-కాదు అదేమిటి? డ్రాయరు-మీదపెట్టి లేపుదాంగదా, అని దగ్గరకెళ్లాను. నిద్దరపోతున్నట్టె ఉన్నాడు సుమా (గద్గదికంతో) మీద చెయ్యేసేసరికి వట్టి మంచుగడ్డ.

చ:—అప్పుడు నన్ను కేకేసింది. ఆపళంగా నేను మేడమీదికి పరుగెత్తాను.

మ:—ఇహ, అప్పుడేంచెయ్యం?

వెం:—ఏంచెయ్యడాని కేముంది?

న:—అప్పటికే పోయాడేం?

చ:—ఆవిషయంలో నేమీ డౌటులేదు.

న:—అతనెప్పుడోప్పుడు అకస్మాత్తుగా పోతాడని నేనెరుగుదును.

మ:—(కళ్లుతుడుచుకొని, చీదుకుని) మేడమీదికెళ్లి ఓమాటుచూచొస్తారా, లేకపోతే కాస్తటీ తాగి చూస్తారా?

న:—(మొగుడికేసిచూసి) ఏంచేస్తారు?

వెం:—నాకంత బాధలేదు.

న:—పోనీవే నీళ్లుకాగిఉంటె కాస్త ఇయ్యి. ఏముందిహ ఏడవడమేగా.

వెం:—కాస్త బలంగా అయినా ఉంటుంది.

న:—మాట్లాడక ఊరుకోలేరు?

(మ. బల్లమీద కాఫీకప్పులు, ప్లేట్లు సర్ది లోపలికెళ్లును)

చ:—మన మింకొక విషయంకూడా నిర్ధారణచెయ్యాలి. నీతండ్రిగారి నిర్యాణాన్ని గురించి కాస్త పేపర్లకుకూడా......

న:—నేనూ అదే ఆలోచిస్తున్నా. ఏమనివ్రాయిస్తే బాగుంటుంది?

వెం:—ఏముంది? ఫలానావారు ఫలానామోస్తరుగా......

న:—ఛ ఊరుకోమంటే ఊరుకోలేరూ? మోస్తరుగా యేమిటి? ఫలానాయేమిటి? మానాన్నంత అనామకుడుగాడు.

మ:—(ప్రవేశించి విని) ఆవేమీవద్దు. గుండువారి వీథిలో తన రెండవకూతురి మేడలో...

వెం:—మాబాగా వాసనేస్తోంది! మీ రేంటీ ఉపయోగిస్తారే మాలక్ష్మీ?

న:—ఏమిటామాటలు? మంచీ, చెడ్డా అక్కర్లే? తండ్రిచచ్చి మేమేడుస్తుంటే టీ అని మీ రేడుస్తారేం?

వెం:—(గతుక్కుమని ఊరుకొనును)

చ:—ఎవరినన్నా తెలిసినవాళ్లని పట్టుకుని పద్యరూపకంగా......

న:—నువ్వెవరినైనా ఎరుగుదువా?

చ:—ఒకాయ నున్నాడు; మనిషి సరదాయైనవాడే కాని పద్యాలలోమాత్రం యెప్పుడూ యేడుస్తాడు. ఏడుపుతోగాని ఆయనకి కవిత్వంరాదు.

వెం:—కవిత్వంకూడా యేడుస్తూ ఉండదుకదా?

చ:—ఫరవాలేదు. మానవమాత్రులికి బోధపడదు సాధారణంగా.

మ:—చావుకబురు పద్యాలలో నెందుకు?

న:—గొప్పవాళ్లందరి చావు పద్యాలలోనే ఉంటుంది.

వెం:—చావుకి గొప్ప బీదా యేమిటి?

న:— ఊరుకొమ్మంటే.

చ:—"దివిజకవివరుగుండియల్ దిగ్గురనగ" అన్నట్టు రాయించాలి.

వి:—అంటే యేమిటే అమ్మా?

మ:—అలా అడక్కూడదు.

వెం.—(నవ్వును)

న:—(కోపముతో చూచి) "నన్నిడిచిపెట్టెళ్లినాడే నాబాబు నాకంటమసిబూసినాడే" ఆమోస్తరుగా రాస్తే నాకుబాగుంటుంది. ఇప్పటివాళ్లకిలాంటివే రుచిస్తాయి.

చ:—అప్పుడే అలారాయడం బాగుండదు.

వెం:—శవం ఇంకా యింటిలోనే ఉందిగా?

మ:—"ముద్దుల్ జిల్కోడు ప్రాణనాథుడును, చేతోమోద మొసంగు తండ్రియును, సర్వార్థంబులగూర్చు మిత్రుడును"అని యేమైనా వ్రాయిస్తే......

చ:—ఛీ,ఛీ, అన్నీతప్పులే.

మ:—ఎప్పుడో కాని పేపరులో చూశాను. అలాగేవుంది.

వెం:—కవిత్వమేగాని గణాలుగిణాలుతోటి పనిలేదు.

చ:—"విశృంఖలాః కవయః" కాబోలు.

న:—చదవటానికి, వినడానికి యింపుగాఉంటే చాలు.

మ:—టీ చల్లారిపోతోంది.

వెం:—వేడిగాత్రాగితే బుద్ధులు వికసించి ఈపాటి కిది తేలిపోవును.

చ:—నిన్న ప్రజామిత్రలో ఒకపద్యం చూచాను. చాలా శ్రోత్రియంగా ఉంది.

న:—నాకలాంటివి నచ్చవు.

వెం:—"యిడిసిపెట్టా"డంటే బాగుండేం?

మ:—మానాన్నెప్పుడూ అలాంటి మాట లనేవాడుకాడు.

న:—మీముఖాలి కెంచడంకూడానా? కేవలం ఉన్నదున్నట్టే వ్రాస్తే కవిత్వం అనిపించుకోదు. మాటల్తోటీ పనిలేదు, భావమేకాని.

చ:—భావకవిత్వమా?

న:—తెలివితేటలు? అదేంకాదు. నాకిదేమీ పనికిరాదు. అతణ్ని మనము ఎంతగా ప్రేమించామో, అతని కెలాటి మంచిగుణాలుండేవో, అతనుపోవడంవల్ల మనకీ లోకానికీ ఎంతనష్టం వచ్చిందో ఇవన్నీ పెట్టి పద్యాలురాయించాలి.

వెం:—ఓ శతకమా?

న:—మీకెందుకూ? మీరేం వ్రాయాలా ఏడవాలా?

చ:—పంచరత్నాలు చాలు.

వి:—అమ్మా, పంచరత్నాలేమిటే?

మ:—ఉంటాయిలే.

వెం:—చావుపద్యాల్ని రత్నాలే అంటారా?

న:—అంటే అంటాం, మాయిష్టం...అంతకొంచెం బాగుంటుందా? ద్వాదశస్తోత్రాలైనా ఉండాలేమో!

మ:—అంతపొడుగ్గాఉంటే ఖర్చుఎక్కువౌతుంది. ఊరికే వేస్తారాఅచ్చు?

చ:—సావకాశంమీద ఆలోచిద్దాం.

వెం:—ఇదెంతోయి కాస్త"టీ" తాగావంటే నిమిషంలో తోస్తుంది.

న:—అబ్బబ్బ, పొయ్యిమ్మా, గోలయినాఅణుగుతుంది. టీ త్రాగాక ముందుగా మనం చేయవలసినపని బోలెడుంది. అతనివస్తువులన్నీ లెఖ్కచూచి జాబితారాయాలి. అతని గది నిండా బోలెడుసామా నుండేది.

చ:—అతనిదగ్గర వెండిబంగారాలు, వజ్రవైడూర్యాలు ఎప్పుడూ ఏమీ కనబడలేదు.

న:—అతని కో బంగారపువాచీ ఉండేది. ఎప్పుడూ మాచిలకతల్లి కిస్తానసేవాడు.

మ:—ఊఁ?...నాతోటి ఎప్పుడూ అలా గనలేదు.

న:—అబ్బే, నిజమేనే మాలక్ష్మీ! నాదగ్గిరుండేటప్పు డెప్పుడూ అలాగే అనేవాడు. చిలకతల్లి అన్న పేరు అతనేపెట్టాడు దానికి. అదిఅంటే యెంతో అభిమానం.

మ:—ఏమో, నా కేమీ తెలియదు.

వెం:—దానికేం? అతని ఇన్సూరెన్సొకటుందికాదూ? ఈఉదయాన్ని చెల్లించినదానికి రసీదు తెచ్చాడా?

మ:—ఏమో, నేను చూడలేదు.

వి:—(సోఫామీదనుంచి గెంతిలేచి)అమ్మోయి,అసలే, తాత య్యందుకోసమేకాదే వెళ్ళ!

మ:—నీకు తెలియదమ్మా, వెళ్లాడులే.

వి:—నేనుచూశానే, ఆయ నెవరోగాని, ఎప్పుడూ తాగిఉంటాడూ...

మ:—సుబ్బయ్యా?

వి:—కాదే.

మ:—శర్మగారా?

వి:—ఆఁ, ఆయనే. గుమ్మంలోనే కనిపించాడే, ఇద్దరూకలిసి, 'వేళయిపోయింది, స్టేషనుకువెడదాం' అనుకుంటున్నారే.

మ:—అవును. అక్కడేదోఉంటుందిట దుకాణం.

వెం:—రిఫ్రెష్మెంటు రూముకా?

మ:—అదేకామోను. అక్కడ దొరసానులూ వాళ్లూ ఉంటారుటకాదూ?

వెం:—అయితే, అతను ఇన్సూరు కట్టనేలేదూ? ఆలస్యమైపోయిందేమొ?

మ:—మించిపోయేఉంటుంది.

న:—అతను కట్టివుండడని నా కిదివరకేతోచింది.

చ:—నీ కన్నీ ముందే తెలుస్తోంటాయి.

వెం:—తాగుబోతువాళ్లంతా యింతే.

న:—మనకిలాగైనా నష్టం తేవాలని అత నలా చేశాడు.

మ:—వోసేవ్, అక్కయ్యోయ్, ఈమూడేళ్లపట్టీ చచ్చిచేశానుచాకిరీ, యెముకలుపాడి అయ్యేటట్టు. తెపుకులినేసేవాడు. ఆఖరికి ఎంతదగా చేశాడో!

న:—నేనుచెయ్యలేదుటే అయిదేళ్లు?

మ:—ఎప్పుడూ ఇక్కడికే పంపించేద్దామనే చూసేదానివిగా?

చ:—ఇంతకూ అతనుకట్టలేదని నిర్ధారణగా తేలిందే?

న:—నాకు తెలుసు. ముందే నా కిలాంటివి స్ఫురిస్తుంటాయి.

మ:—విశాలా, మేడమీదికి పరుగెత్తుకెళ్లి, తాతయ్యబల్లమీద తాళంచెవు లుంటాయి, తీసుకురా.

వి:—(భయంతో) అమ్మో, తాతయ్యగదిలోకే!

మ:—ఏం?

వి:—నాకుభయమేస్తుంది బాబూ!

మ:—ఏమిటా తెలివితక్కువ? నిన్నెవరూ యేమీచెయ్యరులే. (వి. అయిష్టముతో వెళ్లును.) ఒకవేళ ఈబీరువాలోపెట్టాడేమో రసీదు, చూద్దాం.

వెం:—ఎక్కడ? ఈబీరువాలోనే?

న:—ఇదెక్కడిదే మాలక్ష్మీ? నేను క్రిందటిమాటువచ్చేటప్పటికి లేదే?

మ:—ఇదా?...ఒకరోజున మామరిదిగారు కొన్నారు.

న:—చాలాబాగుందే. మంచి పనివాడితనంగా ఉంది. ఏదైనా వేలంలో పుచ్చుకున్నావేమిటోయ్ బావా?

చ:—(పెళ్లాంకేసిచూసి) ఎక్కడే కొంట?

మ:—అవును వేలంలోనే! అంతమరుపేమిటి?

వెం:—ఒస్ పాతదా!

న:—అయ్యో తెలివా! పాతవాటికే పనివాడితనం. పూర్వపు వాళ్లనేర్పు ఇప్పటివాళ్లకెక్కడిది?

వి:—(భయంతో పరుగెత్తుకొచ్చి జాగ్రత్తగాతలుపేసి) అమ్మోయి అమ్మోయి!

మ:—ఏమే చిట్టితల్లీ?

వి:—తాతయ్య కాళ్లూ, చేతులూ ఆడిస్తున్నాడే!

వెం:—ఆఁ?

మ:—ఏమిటే ఆమాటలు?

వి:—తాతయ్య లేచాడే!

న:—పాపం చంటిపిల్ల జడుసుకుంది.

మ:—బాగుందే నీతెలివి! తాతయ్య చచ్చిపోయాడు కాదుటే? నువ్వ ఎరగవూ?

వి:—లేదే! లేచి బట్టలూ అవీ దులుపుకుంటున్నాడే. నేను చూస్తేనే!

(అంతా ఆశ్చర్యముతో తెల్లబోతారు.)

న:—ఒసేవ్ మాలక్ష్మీ, నువ్వువెళ్లి ఒకమాటు చూసిరా.

మ:—(మొగుడికేసిచూసి) రండి మీరుకూడా, వెళ్లొద్దాం.

చ:—(భయంతో వణికివణికి కూలబడును)

వెం:—స్, అదిగో చప్పుడు.

(అంతా తలుపుకేసి చూస్తారు. చిన్నదగ్గు వినిపించును. అంతా లేచి వొకళ్లవెనకాతలొకళ్లు జరుగుతూ గోడదాక పోతారు. తలుపు మెల్లిగా తెరవబడును. చెదిరిపోయినతల, నలిగిపోయిన బట్టలు, తేలిపోతున్నఅడుగులు, ఊగుతూన్నశరీరముతోటి 70 ఏళ్లు దాటినవాడు మెల్లిగా ప్రవేశించును. కాలికి మేజోళ్లు, కేవురించిన కళ్లు, ముఖం; అతనివాలకం తాతయ్యో, తాతయ్యదయ్యమోలాగుంటుంది.)

తా:—ఏమే, విశాలా...

వి:—అమ్మోయ్......

మ:—(బుజ్జగించును. తా. చూడకుండా దణ్ణాలుపెట్టును.)

తా:—నీకేమొచ్చిందే అలా పారిపోయావు? (వెం. న. లను చూచి) ఏమర్రోయ్ మీ రెందుకొచ్చారు? కులాసాగాఉన్నావోయి వెంకప్ప? (అని వెం.ను పట్టుకోబోవును. వెం. వెనక్కుతగ్గి పెళ్లామునుకూడా జబ్బపట్టుకుని దూరంగా తీసుకునిపోవును.)

మ:--అక్కడేవుందు మీదికిరాకు నాన్నా-మరి-మరి నువ్వు మానాన్నవే? (చేతితోటి పొడుచును)

తా:—అలాపొడుస్తావేమే, నీమొహమీడ్చా? నేనే. ఏమిటీ అసందర్భపువాగుళ్లు?

మ:—(మిగతావాళ్లతో) జీవంతోటే ఉన్నాడు.

వెం:—దయ్యాలూ అలాగే కనిపిస్తాయి.

తా:—(కోపంతో) ఇన్నాళ్లపట్టీ నామాటైనా కనుక్కోక ఏమే నరిసీ వచ్చాకయినా పలకరించవేం?

న:—నువ్వు-అనుకోకుండానే గబుక్కునవచ్చేశావు నాన్నా. అందుకని తెల్లబోయాను. నీవొంట్లో కులాసాగాఉందా?

తా:—ఏం?

న:—నీకువొంట్లో మరేమీలేదుగదా?

తా:—ఓ, నాకేం? నిక్షేపంలాగున్నాను. కొంచెంతలమాత్రం నొప్పిగాఉంది. నేనేం కాటికి కాళ్లుచాచుకుండలే. చలపతే నాకంటె నీరసంగా ఉన్నాడు.

న:—బాగానేఉంది. నాకు మొదటినుంచీ అనుమానంగానేఉంది (తా. కుర్చీవైపు కెళ్లును. చ. దారిలోనుంచి ఛంగున తప్పుకొనును.)

తా:—ఏమే, లచ్చీ, నాకాలివి కొత్తజోళ్లు ఏమైపోయాయి?

మ:—నీ మంచందగ్గిరలేవూ?

తా:—నా కక్కడ కనపడలేదే? (చ. ఖంగారుగా జోళ్లిప్పడంచూసి) నువ్వెందుకు తొడిగావు? అవి నావేనా?

మ:—నేనే, నాన్నా, అవికొత్తవిగదా, బిగువుగాఉండి ఒత్తుకుంటాయి, కాస్త సాగితే కరవకుండా మెత్తగాఉంటాయని ఆయనన్నోమాటు తొడగమన్నాను. (మొగుడిదగ్గిరకెళ్లి విసురుగాలాగితెచ్చి తండ్రికాళ్లదగ్గిరపెట్టును. వాటిని తా. తొడిగి కుర్చీలోకూర్చుండును.)

న:—(మొగుడితో) నాకిదిబొత్తిగానచ్చలేదు. ఏం మర్యాదా? మనిషి పూర్తిగా చావకుండానే అతని జోళ్లుతొడగడం?

(చ. కిటికీతెరిచి చూచుచుండును. విశాల పరుగునవెళ్లి తా. కాళ్లదగ్గిర కూర్చుని)

వి:—తాతయ్యోయ్, నాకెంతసరదాగా ఉందనుకున్నావు?

తా:—ఏమే, చిట్టీ?

వి:—మరి నువ్వు చచ్చిపోలేదు కాదూ?

మ:—ఏడిశావు, నోరుముయ్యి.

తా:—ఏమిటమ్మా అదీ? ఎవరు చచ్చిపోయారు?

మః—(గట్టిగా) చచ్చిపోవడంకాదు. మీకు తలనొప్పిగా ఉందని విశాల విచారిస్తోంది.

తాః—ఓహో అదా? ఆసి చిట్టిముండా! పోయిందిలే.

మః—(న. తో) విశాలంటే అతనికి పంచప్రాణాలూను.

నః—అవును మాచిలకతల్లిఅన్నా అంతే.

మః—బంగారపువాచీ నీపిల్ల కిస్తానన్నాడేమో అడగనా?

నః—ఇప్పుడేనా యేమిటి సమయం? మంచీ చెడ్డా అక్కర్లే?

తాః—ఏమోయి వెంకప్పా, నీ మొహాన్ని పట్టిగంధమే ఉందేం? అదేమిటోయ్ చలపతీ నీముఖం అలాగేఉందేం? (మ. న.లతో) మీముఖాలు అలాగే ఉన్నాయేం? ఎవరైనా మన కుటుంబంలోవాళ్లు పోయారా యేమిటి?

మః—నువ్వెరగవు బావకిదగ్గిరవాళ్లే.

తాః—ఏమవుతాడోయ్ నీకు?

మః—అతని అన్న.

వెంః—(నెమ్మదిగా) నాకు అన్నేలేందే!

తాః—నీ కన్నెవరోయ్?

నః—అంటే, పెత్తండ్రికొడుకు. వాళ్లు మొదటినుంచీ దూరంగానే ఉన్నారు. అంచేత ఎవళ్లూ యెరగరు.

తాః—అయ్యోపాపం, అతనిపేరేమిటోయ్?

వెంః—(మ. తో) నువ్వేచెప్పు!

మః—బాగుంది నువ్వేచెప్పు (చెవిలో) సోమప్ప.

నః—(రెండో చెవిలో) ఆపేరు బాగులేదు. ఆదెప్ప.

తాః—అలాగుటకలేస్తావేం? విచారించకు. పోయినవాడు మళ్లీవస్తాడా యేమన్నానా?

వెంః—అతని పేరూ...సోమ...

నః—ఊఁ.

వెంః—ఆదె...

మః—అన్నా!

వెంః—అన్నప్పండి.

తాః—అన్నప్పా! ఎక్కడపోయాడు?

వెంః—ఎక్కడంటే...(తలగోక్కుంటూ మ.న.ల కేసిచూచును.)

నః—ఏదోపేరు తగలెయ్యండి.

వెంః—విశాఖపట్నంలోనండి.

తాః—పెద్దాసుపత్రి ఉందని తీసుకెళ్లారుకామోసు. పాపం, సముద్రతీరాన్నే మరణించాడేం? నీకంటె ఏమాత్రం పెద్దవాడు?

వెంః—5 ఏళ్లుంటుంది.

తాః—నువ్వే చెయ్యాలా?

వెంః—ఆ, అలాగే.

న, మ:—(తాతయ్య చెవులలో) అక్కర్లేదు. ఆయనకు కొడుకులున్నారు.

వెం:—నేను వెళ్లక్కర్లేదు. మర్చిపోయాను. (దూరముగా పోవును.)

తా:—(లేచి) కప్పులన్నీ అమర్చి, కాలీగావుంచారేమర్రా? నాకోసం కనిపెట్టు కున్నారా యేమిటి? పాపం! కూర్చోండి. నాకూ ఆకలేస్తోంది.

మ:—టీచేసి పట్టుకొస్తా.

తా:—కూర్చోరేం? అలాగే నిలబడిఉన్నారేం? రండిరండి. ఏమిటా తెల్లబోవడం? సరదాగా ఉండడంచేతగాదూ? నే నోపాటపాడుతాను వినండి. (పాడును.)

మ:—అబ్బె, (టిఫిన్ ప్లేట్లలోపెట్టును).

వెం:—రండి, మామగారూ, ఇందాకానే ఆకలన్నారు.

తా:—నువ్వెప్పుడూ మంచివాడవేనోయి. నీమూలాన్నే ఆనాల్టునాళ్లైనా బ్రతగ్గలిగాను. (అని గబగబతినుట కారంభించును.)

వెం:—(తెల్లబోయి, చూచిచూచి, గబుక్కునఅడ్డుకొని) అప్పుడే అంతతొందరపడకండి. గొంతుకడుతుంది. మీకింకా బాగా చేరుకోలేదు.

న:—ఏమిటా చేరుకోనేది?

వెం:—(నవ్వుతూ) ప్రా-ణ---

న:—ఇంకావదలరూ?

తా:—నాకేంలోటు?

న:—ఆయనమాట్లకేంలెస్తూ, నాన్నా? ఏదో వాగుతూంటారు.

వి:—అవునే దొడ్డమ్మా, పొద్దున్నేగా తాతయ్య చచ్చిపోయాడు?

తా:—నేనా?

మ:—(వి. నోరునొక్కి) ఊరుకోవే, జ్యేష్టముండా!

వెం:—(నవ్వుతూ) ఇప్పుడు మీకు వంట్లోకులాసాగానే ఉన్నట్టుంది.

వి:—పొద్దుటినుంచీ నిద్దరపోయావేమిటి తాతయ్యా?

తా:—అబ్బె, నిద్దరలేదమ్మా.

మ. చ:—ఆఁ!

తా:—కొంచెం తలతిరిగినట్లుగాఉంటేను, కళ్లుమూసుకుని పడుకున్నాను. కాళ్లూ, చేతులూ బొత్తిగా నావశంతప్పిపోయాయి. ఇటుదటుపెట్టలేకపోయాను.

వెం:—అయితే, మామగారూ...

న:—ఏమిటి మళ్లీ?

తా:—అతణ్ని మాట్లాడనీయవేం?

వెం:—మీకు అప్పట్లో చూపూ, మాటా ఉన్నాయా?

తా:—లేకేం? కాని, అప్పు డేంజరిగిందో నాకు బాగాజ్ఞాపకంలేదు. ఏదీకొంచెంవడ్డించు.

మ:—నిజమే. (వడ్డిస్తూ) నీకు అప్పు డాట్టేస్మారకంలేదు. గుట్టుకూడాపట్టావేమో.

చ:—గుట్టేమిటి, నీముఖం, గుండెలేఆగిపోలేను?

న:—గుణ్ణుపట్టుతోందంటే అలాగెలాగనుకున్నావే మరి ?

తా:—ఏమని ?

మ:—ఏంలేదు నాన్నా. ఏమిటో, అవకతవకమాటలు.

తా:—నాకిదంతాపనికిరాదు. నేను నిద్దరాపోలేదు. గుణ్ణూ పట్టలేదు. నాగుండె లాగీ పోలేదు. నిజంచెప్పుతారా లేదా ? ఏమే, లచ్చీ ?

న:—మాలక్ష్మీ, మొగుడూ నీగదిలోకిరావడం నువ్వెరుగుదువా ?

తా:—(బుర్రగోక్కుంటూ) కొంచెంజ్ఞాపకంతెచ్చుకుని...

మ:—ఇప్పుడతణ్ణి యేమీబాధపెట్టకే, అక్కయ్యా !

చ:—మామగార్నిప్పు డేమడిగినాలాభంలేదు. ఆయన కేంజ్ఞాపకముంటుంది ?

తా:—ఉండుండు. జ్ఞాపకమొచ్చింది. మీరిద్దరూ నాబీరువాని, నాగదిలోంచెందుకు పట్టుకుపోయారు ?

న:—ఏంబీరువా నాన్నా, అనీ ?

తా:—ఏబీరువా యేమిటి ? నేను మొన్నకొనుక్కొన్నది !

న:—(బీరువాకేసిచూపిస్తూ) అదేనాయేమిటి, నాన్నా ?

తా:—ఆఁ అదే. ఇక్కడేంచేస్తోంది యిది? (అందరూ నిశ్శబ్దంగా ఉందురు. గడియారం టుక్ టుక్ అని వినిపించును) అదిగో ఆగడియారమూ నాదే. ఇవన్నీ యిక్కడి కెందు కొచ్చాయి? దయ్యాలేమైనా ప్రవేశించలేదు గదా !

వెం:—హ్రాం, హ్రీం, రాం, వం, క్లీం......

వి:—అమ్మాయి భయమేస్తోందేవ్ !

న:—(లేచి) నాకిప్పుడంతా బోధపడుతోంది. ఏంజరిగిందో నేను చెప్పగలను. దయ్యాలూకావు భూతాలూకావు. కేవలం దొంగలు.

మ:—ఊరుకుందూ అక్కయ్యా, నీకు పుణ్యముంటుంది.

న:—నేనూరుకోను. అమ్మ ! ఇంత నీచానికొడబడతారా ?

చ:—ఇదిగో నరసమ్మా నామొహమైనా చూసి...

న:—ఛీ, నోరుముయ్యి.

మ:—(లేచి) పోనీపోనీ అని వూరుకుంటుంటేను ఏమిటే ఆమాటలు మాయింటికొచ్చి?

చ:—ఏమిటాకేకలు ? ఊరుకో. జగడమాడితే ఏమీలాభంలేదు.

వెం:—(లేచి) దానికి తోచినట్లల్లా మాట్లాడడానికి నాపెళ్లాంకి హక్కుంది.

మ:—నాయింట్లో వల్లకాదు. వీధులోకి వెళ్లి మీయిష్టంవచ్చినట్లు వాగుకోండి.

తా:—(బల్లగుద్ది) నోరుమూయండంతా. అసలు ఏంజరిగిందో యెవరైనా చెప్పుతారా?

న:—(మొగుడిని, మరిదిని తోసుకొచ్చి) నేను చెపుతాను నాన్నా. నీవన్నీ యెత్తుకు పోయారు.

తా:—ఎవళ్లాదొంగలు ?

న:—మాలక్ష్మి, మొగుడూనూ. నీబీరువా రొత్తుకుపోయారు. నీ గడియారం దాచేశారు. నీ జోళ్లు తొడిగేసుకున్నారు. తాచుపాముల్లాగ రాత్రి నీగదిలో ప్రవేశించి చీకటిలో నిన్ను కాటేసి నువ్వుచచ్చిపోయాక......

చ,మ:—ఉస్ ఏమిటామాటలు ?

న:—నానోరు నొక్కడామని చూస్తున్నారు. నీవంట్లోనుంచి ప్రాణాలెగిరిపోయాక...

తా:—ఎవరివంట్లోనుంచీ?

న:—నీ బొందిలోనుంచే!

తా:—నేను చావకుండానే?

న:—లేదులే. వాళ్లలా అనుకున్నారు (అంతానిశ్శబ్దం.)

తా:—(అందరిని తేరిపారచూసి) ఓహో అందుకా మీరంతా మైలబట్టుతున్నారు. నేను చచ్చిపోయా ననుకున్నారూ? అరి మీ తస్సాగొయ్యా ఎంతపొరపాటు పడ్డార్రా ! (నవ్వును)

మ:—(ఏడుస్తూ) నాన్నా !

తా:—అయితే నావస్తువులన్నీ యిట్టే పంచేసుకున్నారేం?

న:—లేదు నాన్నా, నేనేమీ యెరుగను. మాలక్ష్మే దానికి కావలసినవన్నీ తీసుకుంది.

తా:—నువ్వెప్పుడూ తెలివైనదానివేనే మాలక్ష్మి, ఏం నావిల్లు న్యాయంగా ఉండదనుకున్నావా?

చ:—అయితే మీరు విల్లు వ్రాశారా ?

తా:—ఆఁ. ఆబీరువాలోనే పెట్టాను.

న:—ఏం రాశావు నాన్నా ?

తా:—దాని అవసరమేమీ ఇప్పుడు లేదులే. అది చింపేసి మరోటి రాద్దామనుకుంటున్నాను.

మ:—(ఏడుస్తూ) నన్ను అన్యాయంచేస్తావా నాన్నా ?

తా:—అలాగైతే ఇంకో కప్పు టీ యియ్యి: పంచదార బాగావెయ్యి. పాలుకూడా జాస్తీగానే తగిలించు.

మ:—(ఉత్సాహంగా) నీయిష్టంవచ్చినట్లా అలా అడిగి చేయించుకో. నీకేమీ లోటు చేయను. (టీ పోయును.)

తా:—నేనెవ్వరినీ బాధించను. నే నేంచెయ్యదలచుకున్నానంటే వినండి:—మీ అమ్మ పోయినప్పటినుంచీ, లచ్చీ, నీదగ్గర కొన్నేళ్లున్నాను. నర్సీ, నీదగ్గి రాఉన్నాను కొన్నేళ్లు. అందుకో సమనే విల్లుమార్చి కొత్తది వ్రాస్తాను. నేను చచ్చిపోయేటప్పటి కెవళ్లదగ్గిరుంటే వాళ్లకిచ్చేస్తాను నాఆస్తంతా. ఏం ఆపద్ధతి నచ్చిందా మీకు ?

చ:—లాటరీలా గుంది.

న:—ఇంకిప్పటినుంచీ నువ్వెవరిదగ్గి రుండదలచుకున్నావు?

తా:—(టీ త్రాగుతూ) వస్తున్నా.

న:—ఈపాటికి నువ్వు మళ్లీ మాదగ్గిర కొచ్చేయొచ్చు: నీకు కావలసిన సదుపాయాలన్నీ చేస్తాను.

మ:—నీదగ్గిరున్నన్నాళ్లు యింకా నాదగ్గి రుండనేలేందే ?

న:—ఈవేళ యింతపని జరిగాక యింకా నాన్న నీదగ్గి రుంటాడని అనుకోను.

తా:—ఏమే నర్సీ, మళ్లీ మీ యింటికి రమ్మంటావా ?

న:—నీయిష్టం వచ్చినన్నాళ్లు! నీకు కావలసినట్లల్లా జరిగిస్తూ నీపాదసేవ చేయడానికి నాకేమీ అభ్యంతరంలేదు.

తా:—ఏమే లచ్చి, నువ్వేమంటావు ?

మ:—నేనేం అనగలను? ఈరెండేళ్లల్లోనూ దాని మనస్సమాంతంగా మారిపోయి-(లేచి) నాన్నా అసలు మాయిద్దరికీ తగువెందుకొచ్చిందో నువ్వెరగవూ ?

న:—ఇప్పుడెందుకే, అవన్నీతవ్వుతావు ? కూర్చో.

మ:—నేనొప్పుకోను. నాదగ్గిరతణ్ణి ఉండనీయకపోతే, నీదగ్గిరా ఉండనీయను. (తండ్రితో) ఇంకెప్పుడూ నిన్ను తనదగ్గి రుంచుకోనంటేనేకాదూ, మేమిద్దరమూ జగడమాడుత ? ఇదివరకైన శాస్తి చాలుననలే ? జన్మజన్మాలకీ మర్చిపో నా వేపుకుతినడం. నీనెత్తికి తప్పదంటేనేకాదూ అంతరాద్ధాంతసిద్ధాంతా లవుత ?

తా:—నన్నుంచుకుని, కాస్తచాకిరీచేయడమంటే మీయిద్దరికీవొక్కలాగేఉంది. ఎంత దయతోచూశారో నేనెరుగుదును.

మ:—నావల్లనేమైనా పొరపాట్లుంటే నువ్వవన్నీమర్చిపోయి నన్నుక్షమించాలి.

న:—నన్నుమాత్ర మలాక్షమించవాయేమిటి ?

తా:—మించిపోయింది. ఇం కిప్పుడేమీలాభంలేదు. మీయిద్దరికీకూడా లేకపోయింది కాస్తఓపిక.

మ, న:—మాకోపిక లేకేం ?

చ, వెం:—మమ్మల్ని వేపుకుతినడానికి !

తా:—ఇప్పు డలా గనరూ, నాడబ్బుసంగతిచెప్పాక? సరే, నేను మీకు భారమైపోయాను కనుక కావలసినవాళ్లదగ్గిరే ఉంటాను.

వెం:—ఇదిగోచూడండి, మామగారూ...

తా:—ఏమిటి, నీముఖం ?

వెం:—ఏదోకూతురిదగ్గిరే మీరుండాలికాని లేకపోతే...

తా:—ఊఁ. లేకపోతే ?

వెం:—లోకం ఏమన్నా అనుకుంటుంది.

తా:—ఏమనుకుంటుంది ?

వెం:—ఏమన్నా అనుకుంటుంది.

తా:—అనుకోనీ. నేనేం చెయ్యదలచుకున్నానంటే—మూడుసంగతులున్నాయి, రేపటి సోమవారంలోపుగా చేసేయాలి. One— ప్లీడరుదగ్గిరకెళ్లి విల్లుమార్పించడం. Two— ఇన్సూరెన్సు ఆఫీసుకెళ్లి భీమాకట్టడం. Three— ఆనందాశ్రమంలోకెళ్లి పెళ్లిచేసుకోవడం.

వెం, చ:—పెళ్లా ?

న:—పెళ్లాడతావు ?

మ:—నాన్నకి మతిపోయింది.

తా:—నేను పెళ్లిచేసుకుతీరుతాను.

మ:—ఎవర్ని ?

వి:—తాతయ్యా, నన్ను చేసుకుంటావా ?

తా:—(వి.ని ముద్దాడుతూ) మీఅమ్మా, నాన్నా ఒప్పుకోరమ్మా.

వి:—ఏమే, అమ్మా ?

మ:—ఏడిశావు, వెధవమాటలు !

తా:—నీకంతకష్టమెందుకులే.

చ:—అయితే వట్టిదేనా ?

తా:—కాదు. నిజమే. ఉంది ఒకక్రైస్తవదొరసాని.

న:—ఏం, తెలుగువాళ్లు లేకపోయారా ?

తా:—ఇంకా వేళాకోళమే, సీతా ?...అప్పుడే చాలారోజులక్రితమే నిశ్చయమైంది. మీకింతకష్టంగా ఉందికదాఅని నేనూ చాలావిచారిస్తూనేయున్నాను. ఎవళ్లుచేస్తారా సంతోషంతోనని చూస్తున్నాను. మీకు చూడాలనిఉంటే మీరంతా నావివాహకార్యానికి మళ్లీ ఆదివారం ఆనందాశ్రమంలోకి ఉదయం 9½ గంటలకి తప్పకుండావచ్చి నాహృదయపూర్వకమైన ఆహ్వానం అందుకొని మదర్పితచందన తాంబూలాదుల స్వీకరించి నన్నానందాబ్ధి నోలలాడింప కోరుచున్నాను. భీరువా శ్రమలేకుండాక్రిందికి దింపిపెట్టినందుకు, నీకు నా యాశీర్వచనములు. చలపతీ, ఆగడియార మిలాపట్టుకురా. (పుచ్చుకుని) నాటి నాకిచ్చినందుకు నువ్వు వెయ్యేళ్లు వర్ధిల్లు. మనిషినిపంపిస్తాను. కస్సుర్తిపడక నా సామానంతా వాడిచేత పంపించెయ్యండి. Good night.

వెం:—ఉండండి, పెళ్లికొడుకుగారూ, మంగళహారతినియ్యనీండి.

తా:—Thank you.

# మన నాటకములందలి సంగీతము

## వింజమూరి వరాహనరసింహాచార్యులు

భారతదేశమున నాట్యకళ బహుప్రాచీనకాలమునుండియు గలదనుటకు నిదర్శనములు కలవు. సంగీత మెప్పటినుండి గ్రహింపబడినదో యప్పటినుండియు నాట్యముకూడ నెఱుగబడినదనునది తథ్యము. సంగీతనాట్యముల ప్రాచీనత నెంచుచు గొందఱు నాట్యమే ప్రథమమున గలదని వాకొనిరి. కాని పెక్కుప్రాచీనవాగ్గేయులు "గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీతముచ్యతే" అనిచెప్పినప్పుడు నాట్యము సంగీతముకన్న ప్రాచీనమగునట్లు చెప్పుట పొసగదని యెంచవలసియున్నది. నాట్య మేకాలమునాటిదైనను కరము ఆదరణీయముగ నుండెననుట నిర్వివాదము.

నాట్యకళగూర్చి మనకు లభ్యమగు ప్రాచీనగ్రంథము భరతమునివిరచిత "నాట్యశాస్త్రము." ఇయ్యది తక్కినకాలమువారి కాదర్శగ్రంథముగ నుండెననుటకు ఈగ్రంథముగూర్చి వెలువడిన వ్యాఖ్యానములు, అనుకరణములు, అనువాదములు, ఉదాహరణములు సాక్షి. అనంతరము పెక్కు సంస్కృతనాటకములు వెలువడుటయు, నవి ప్రకృతనాటకములకు ఆధారములగుటయు నెఱుగనగును.

కావ్యతత్వప్రకటనము, రసోత్పాదనము ముఖ్యధర్మములుగల నాటకము నాట్యనృత్తనృత్యములతో నలరారునట్లు గ్రహించి యందుల కనుగుణముగ పెక్కుఅంశములు గొప్పమేర భరతాదివాగ్గేయులు తమగ్రంథములందు వర్ణించిచెప్పిరి. ఇందెల్ల సంగీతము ప్రధానమైయుండెననుట కీయంశముగూర్చి భరతుడు విపులముగ జెప్పుటయు, ననంతరమువారు పెక్కు సంగీతగ్రంథములు లక్ష్యలక్షణసమన్వితముగ వెలయించుటయు, దార్కాణము. ఈకళారాధనము ఆధిభౌతికానందమునకుమాత్రముగాక యాధ్యాత్మికప్రాప్తికొఱకు ముఖ్యముగ నక్కఱకువచ్చుననునది మఱువగూడదు.

ఇట్టిసంగీతవిద్య ప్రాచీననాటకములందు నాదరింపబడుచుండెననియు, నిప్పుడు మరింత శ్రద్ధాభక్తులతో ననుసరింపబడుచుండినట్లును తెలియుదుము. పాశ్చాత్యదేశములందును సంగీతము నాటకములందు ప్రధానస్థానమువహించి గానాభినయరంగములు (Operas) కొన్ని ప్రత్యేకింపబడియుంట విదితము. అభినయముప్రధానముగగలవియు (Dramas) గలవు. ఈతారతమ్యము గూర్చి ముఖ్యముగ మనము గ్రహించి సంగీతము నాటకరంగములందు వెలయించుట నెంచవచ్చును.

ఇటీవలికొందఱు నాటకరంగములం దిప్పటివలె సంగీతము ప్రాముఖ్యమువహింపగూడదనియు, అయ్యది రసాభావమునకు హేతువగుచున్నదనియు, నందుచే నదిలేకపోవుటయే మేలనియు నిట్లు ఎలుగెత్తి చాటుచున్నారు. సంగీతములేని పాశ్చాత్యుల అభినయప్రధానములగు రంగస్థలములు నిర్మింపజూచుచున్నారు. కాని కొందఱు ప్రాచీనసంప్రదాయానువర్తులు (Conservatives) సంగీతములేనిది నాట్యము రసవంతముగ జేయుట దుర్ఘటము, దుస్సాధ్యమనియు, ప్రేక్షకుల

మానసముల నరికట్టి విలీనులుగను, వశ్యులుగను చేసికొని వారి కానందమొనగూర్చునది సంగీతమున కన్న వేరులేదనియు వక్కాణింతురు. ఈరెండువిధములగు వాదములు విపులపరచి ఎయ్యది సమ్మతమగునదియు నిటచూపుటకన్న సంగీతప్రభావము నందరు నంగీకరించియుంటచే నాకళ ఇప్పటి నాట్యరంగములందు ముఖ్యముగ నాంధ్రరంగములం దెట్లు ఒప్పియున్నదియు గొంత తెలియుట కర్తవ్యమగుచున్నది.

కర్ణాటకగానమున కాంధ్రావని యాటపట్టువుగనుండెను. శార్ఙ్గదేవునియనంతరము (1210–1247) నుండియు హిందూస్థానీకర్ణాటకసంగీతపద్ధతు లమలునకువచ్చినవనుటకు చరిత్రాంశములు కలవు. అనంతరము వాగ్గేయులు రామామాత్యుడు, సోమనార్యుడు, వెంకటమఖి మున్నగువారు కర్ణాటకగానము నభివృద్ధిచేయుచుండగా దామోదరుడు, అహోబలుడు మున్నగువారు హిందూస్థానీసంగీతమునకు దోహదముచేయుచుండిరి. ఒకటి నారదమతము ననుసరించుచుండ రెండవది హనుమన్మతము ననువదించుచుండినట్లు విదితము.

ఈదక్షిణోత్తరమార్గముల వ్యత్యాసముగూర్చి కడచిన 'నాట్యకళ'యందు వ్రాయుచు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపిన యంశములు కొంతచర్చనీయములుగ నున్నవి. వారు "దాక్షిణాత్యులు శ్రుతిలయమును కొంచె ముదాసీనముచేసిరి. హిందూస్థానీవారు తాళలయము నట్లే అరగంటజూచిరి. రెండుపద్ధతులందు స్పష్టముగా గానవచ్చు భేదమున కిదే మూల"మని చెప్పుట కూడదు. సరియైనభేద మిదికాదు. ఈయంశముగూర్చినచర్చ ముందుగావింతుము. కావున ప్రకృతము సంగీతమున రెండువిధములగు పద్ధతులు కలవని తెలిసినచాలును.

కర్ణాటకగానము నుద్ధరించినవారు ఆంధ్రులే. సంగీతరత్నాకరవ్యాఖ్యానకర్త చతురకల్లినాథుడు, స్వరమేళకళానిధికర్త రామామాత్యుడు, రాగవిబోధరచించిన సోమనార్యుడు, చతుర్దండిప్రకాశిక వెలువరించిన వేంకటమఖి ఇత్యాదు లాంధ్రులే. శ్రీకృష్ణదేవరాయల యనంతరము తంజావూరు రాజధానిగ జేసికొని చోళరాజ్యము నేలిన నాయకరాజులు,మహారాష్ట్ర రాజులు ఆంధ్రనటీనటజనంబుల, సంగీతజ్ఞుల, మరితక్కిన విద్యారాధకుల తమ యాస్థానమున బోషించియుంటచే ద్రవిడదేశమున నీవిద్య కొంతకాలమునుండి వర్ధిల్లుచుండినట్లు చూతుము. పెక్కుభక్తులు రామదాసు, శ్రీత్యాగరాజు మున్నగువారు తమకీర్తనములచే భగవంతుని వేడి పాడిరి. సంగీతమున కాంధ్రులుచేసిన సేవ పేర్కొనుటకు వ్యాసములు, ఉపన్యాసములు చాలవు.

ఇట్లు ఆంధ్రుల ప్రత్యేకసొమ్మగు కర్ణాటకసంగీతము కొలదియాకళారాధకులయందు—ఇప్పటివలె కచేరీలుచేయు కొలదిసంగీతవిద్యాప్రదర్శకులయందు— మాత్రము భద్రపఱుపబడినదనియు, నాట్యరంగములందు కరము మార్చబడి ఔత్తరీయపద్ధతి కేవల మనుసరింపబడి ఆంధ్రవ్యక్తిత్వము పోనాడబడుచుండినదనియు దెలియుట విచారకరము. రంగస్థలములందు సంగీతము కావలయుననువారు తమ కర్ణాటకగానమును వ్యక్తముగ జూపనందులకు వారి నేమనవలయునో తెలియుటలేదు. ఇప్పటి ఆంధ్రరంగములందలి సంగీతము సాధారణముగ ననుకరణముగ నున్నది. అనగా పూనామున్నగు ప్రాంతములందలి సంగీతము అనుసరింపబడుచున్నది. అచ్చటి గ్రామ్యకంఠముగలవారినెల్ల అనుసరింపబడుచున్నది. వారి సంగీతపరిజ్ఞానమును విమర్శింపకయే వారి నుకంఠ

నాదమును— వెఱ్ఱిమొఱ్ఱిదైనను— అనుసరించుట భావ్యము కాదనునది గ్రహింపబడకున్నది. వీరి సంగీతము హిందూస్థానీపద్ధతినైనను చాటుట లేదనునది తెల్లము. హిందుస్థానీసంగీతముసహితము కట్టుబొట్లకులోనై అబ్దుల్ ఖరీమ్, కీ. శే. విష్ణుదిగంబర్ మున్నగువారి గానమువలె శాస్త్రీయమై యొప్పియుండగా తమయిచ్చవచ్చిన బాడు రాగములు సంగీతజ్ఞుల సమ్మతిబడయుట దుస్తరము. స్వరముల ప్రస్తారక్రమమున కర్ణాటకగానమున మేళము లేర్పరుపబడినట్లు ఉత్తరహిందూ దేశపు సంగీతముకూడ జనకరాగములు, పుత్రపుత్రికారాగము లిట్లు నియమింపబడి కట్టుబొట్ల చొప్పున నున్నవి. కర్ణాటకరాగముల రాగాంగభాషాంగోపాంగరాగవిభాగపద్ధతి ఉత్తరమునను కలదు. కొన్ని భాషాంగరాగములందు ఉదాహరణముగ నీలాంబరి, అఠాణ మున్నగువాని యందువలె అన్యస్వరము లించుక చేర్చబడిన రాగములయట్లు ఉత్తరదేశపు రాగములందును కలదు. ఈయీసంగతుల నెఱిగి గానవిద్య కొంతకాలము నేర్చి విద్వాంసులై ఔత్తరాహులును గానప్రదర్శనములు గావించుట విదితము. అంతియేకాని స్వరావళిని నేర్వకయే రంగములందు తమ శ్రావ్యకంఠముల నాధారముగ జేసికొని తమయిచ్చవచ్చిన రాగముల నాలాపించుట సాహసమనకతప్పదు.

ఉత్తరదేశపుగానము కర్ణాటకగానమువలె నచ్చటి యన్నిప్రాంతములందు ఒక్కఫక్కీ నుండుట చూడము. ఏమికారణముననో బెంగాలు, పూనాప్రాంతములందు మన రంగస్థలము లందలి గాయకులవలె శ్రావ్యకంఠముగలవారు కడుశ్రమకోర్వలేనికతమున కాబోలు తమగానము ఇచ్చవచ్చిన పాడుట విదితము. ఇందుచే వీరి రాగములు కొంతస్వేచ్ఛనొంది కట్టుబొట్లు సడలింపబడినట్లు విదితము. అయ్యోడను వారువారట్టుల పాడుట చూతుము. ఇట్టిసంగీతము నేర్వ కుతూహలులగు మన రంగస్థలములందలి గాయకులు ఆయాసంగతులనైనను గమనించి అట్టి మేటి గాయకులపాంత నేర్చి పాడుచున్నారా ?

మనరంగస్థలములందు హిందూస్థానీసంగీతముకాని, కర్ణాటకగానముకాని ఆయాశాస్త్రము చొప్పున పద్ధతికట్టుబొట్ల ననుసరించి పాడబడుట కానమని తెలుచున్నది. అట్లయ్యు పెద్దపెద్ద బిరుదావళితో బెక్కురునటులు ఆంధ్రావనియందు తమసంగీతమువలన ఘనతగ బైటకు వచ్చిరి. వారు జనాదరమునొందుటకు తమ శ్రావ్యకంఠమే, గంభీర-ఉదాత్తనాదమే హేతువని యెంచ బడుచున్నది. అంతియేకాని తమ సంగీతశాస్త్రపరిచితి, అలవాటులవలన వారట్లు ఘనముగ దలంపబడునట్లు అంతగ నేర్వము. వీరిలో పెక్కులు ఒక్కరాగము నాలాపింపబూని యప్రయత్నముగ గాబోలు రెండు మరి పెక్కురాగముల కాలవాలమై పోల్చుటకువీలులేని క్రియాంగ రాగములే పాడుచు మనరంగములందును, మాట్లాడు ఫిల్ములందును తమసంగీతమును ప్రదర్శించు చున్నారు. ఈరంగస్థలముల నిట్టిసంగీతమును వినుటకు గర్ణాటకసంగీతసంప్రదాయము నెఱిగి యల వడిన సంగీతప్రియులు ఏవగించుకొనుట కిదియు కారణమనకతప్పదు. రంగస్థలగాయకులు ఇవి చాలకకాబోలు గ్రామఫోనుప్లేట్లు తమ సంగీతముతో నింపబూనుచున్నారు. వీరి క్రియాంగ రాగములు తెలియని యమాయకప్రేక్షకులు ఆనందించుటయు, ననువదించుటయు జూతుము. పల్లెటూళ్లయందును వీరి సంగీతము తుదకు స్థిరత్వమేర్పరచుకొనుచున్నదనుటకు రెండు మూడుస్వరములందుమాత్రము సంచారముచేయురాగములచొప్పున పద్యములు పల్లెటూళ్లపాపలు

తమపనులందు పాడుట విదితమే. ఈరంగస్థలసంగీత మింతత్వరితముగ ప్రజలలో సామ్రాజ్యము సేయుట ముదావహమనుటకన్న – ఆదరణీయమనుటకన్న – అపకారియగుచున్నదనియు, నందుచే ననాదరణీయమనియు సంగీతజ్ఞులు చెప్పుదురు. ఇందుచే నిట్టిసంగీతము రంగస్థలములందు విరమింపబడుటయే మేలని సంగీతపూర్వసంప్రదాయానువర్తుల యభిమతము. ఈకారణముచే రంగస్థలములందు సంగీత మనావశ్యక మనువారితో జేరి వీరు ఓట్లనొసగుదురు.

ద్రవిడదేశపు రంగస్థలములం దిట్లుకాక కర్ణాటకసంగీత మంతగా మార్పునొందలేదనుట నెఱిగితిని. వారినాటకములు కొలదిగ దిలకించితిని. అం దెయ్యెడను రాగములు కట్టుబొట్లు తప్పించి పాడబడుట వినలేదు. ధనార్జనముగాక గొప్పఉద్యోగపదవులందుండినవారుసహితము ద్రవిడరంగములందు పాడుట వింటిని. కాని వారు ఏరాగమును పాడినను వ్యక్తముగ నారాగ సంచారాముల నెఱిగి పాడుచుండినట్లు విదితమాయెను. హిందూస్థానీదేశపు రాగములు కొందఱు రంగములందు పాడుదురు– ఏల గానప్రదర్శనములందును సంగీతజ్ఞులు పాడుచున్నారుకాని వారు ఆఘక్కీని క్రమముగ బాడుట విదితము. అంతియేకాని ఆనందభైరవి మొదలిడి ముఖారిలో దిగి శ్రీరాగమున బడి మణిరంగులో దేలి భైరవిలో నంతమొందునట్లు పాడుట నిటవలె నంత చూడము. అమాయకపుశ్రోతలు ముఖ్యముగా నాంధ్రావనియందు శ్రావ్యకంఠములకు మెచ్చుకొనుచున్నారుకాని వీరి రాగసాంకర్యముల నంతగ బాటింపలేనికతన సంగీతజ్ఞులు వారిని సక్రమ పద్ధతికి విలీనులగునట్లు చేయుటకు మరింత బాధ్యులగుచున్నా రనవలసియున్నది. బోయని ధ్వనించు ఆర్మోనియమునందు ఆగియాగి ఊగియూగి పాడుటలో మగ్నులై తమనాదము నతిక్రమించవలె ననునట్లు మెట్టుల (Reeds) నుండి బిగ్గరధ్వనులరావించి మించజేయు ధ్వనియందు చిక్కువడి పాడునప్పుడు రాగసాంకర్యమును పాటించుటకు వీరికి తావెక్కడిదని తలపబడును. మరియు నాటకములకు శ్రావ్యకంఠ ముండినచాలుకద! వీరు సంగీతము స్వరములాదిగ గృతులవరకు గష్టించి నేర్వనవసరములేదు. ఇంపగునాదముగలవారెల్లరు నటులే. ఇట్టిచో నాంధ్రావనియందు సాంప్రదాయికమగు కర్ణాటకరాగములు కుంటువడియున్నవన నాశ్చర్యమేమి? ఈశ్రావ్యకంఠులు సంగీతము నోపికతో నేర్చిన గరము నవ్యమగుట విదితము. అప్పుడే సంగీతము రంగములందు కూడునని యెంచబడును.

సంగీతమున కుపకరించునది కాదని పాశ్చాత్యులవలనను చాటబడు ఆర్మోనియము మన రంగస్థలములందు రాజ్యమేలుట యనర్థకమనవలసియున్నది. పూర్వపురంగములందు తంత్రీ వాద్యములు తంబూర, ఫిడేలు మున్నగునవి యుపయోగింపబడుచుండినట్లు తెలియుచున్నది. ఇప్పుడు ట్రొక్కుడార్మోనియము వీనిస్థానము నాక్రమించి గాలివానవలె భోరున ధ్వనిచేయుచు గాయకుని కంఠనాదమును మరుగుపరచి, లేక అతిక్రమించి వాని పదములు, పద్యములు, పాటలు వినబడకుండజేసి యవిచ్ఛిన్నస్వతంత్రతను ప్రకటించుకొనుచుంట తెల్లము. గాయకులును నీవాద్యములేనిది వారి కంఠము లేవదనుస్థితికి వచ్చినట్లు విదితము. ఆర్మోనియముధ్వని ఆగిన వీరికంఠ మాగును. వానిధ్వని పలికిన వీరినాదము వినబడును. అంతయు జెవులు వ్రక్కలుసేయు ధ్వనియే. ఇట్లు రాగవిన్యాసము చేసి చేసి గర్వముతో నొప్పించుటయు, నానందించుటయు నటుల యాచార మగుచున్నది. పాటలు, పద్యములు నడుమనడుమ

కావలసినంత యథేచ్ఛగ రాగపలిటీలు చూపబడునీసంగీతము వినివిని కొందఱు ఈ సంగీతము రంగములందు భావమును మార్పజాలుటచేగాబోలు నక్కఱలేదని చెప్పుచున్నారు. పెక్కురాగముల కాలవాలమై స్వేచ్ఛచొప్పనగల పేరుతెలియని క్రియాంగరాగములు మన స్తత్త్వమునకు (Psychology) సరిపడక భావపోషకములై రసవంతము లగుటకుమారుగ వీనిని మొదలంట రూపుమాపుచేయుట గుర్తింపబడుచున్నది. ఇట్లుకాక సంప్రదాయము ననుసరించు కర్ణాటకరాగములు నేర్చి యట్లు పాడినప్పటిసంగీతము రంగములం దావశ్యక మనియు, ప్రేక్షకులును 'రాగసుధారసపానము సేసి రంజిల్లుదు' రనియు నెంచుదుము. ఇంతదనుక నిప్పటిఫక్కి సంగీతము రంగములం దలంకరించునంతకాలము సంగీతము నాటకములం దనావశ్యక మగునను వారితో నేకీభవించి ఈవిధమగు గాన మక్కఱలేదని వారితో జేరుదుము. ఆర్మోనీయమునకు మారుగ ఫిడేలు మున్నగు తంత్రీవాద్యములు ఆదరణీయములు. ఇక తాళముగూర్చి చెప్పనక్కఱలేదు. పాటలపోకడలు, తెన్ను, అగమ్యమగు తాళము వర్ణించుటకు దుస్సాధ్య మనవలయును. పాటలు ఏఫక్కిని కావలయుననిన నావిధమున దస్తూరుచేయుకవు లుండ, బెంగాలీపాటలు, బొంబాయిదరువులు, పూనాటుమ్రీలు, గుజరాతుగజ్జలులు, వీనికి లోటేమి ? ఇట్టి అనుకరణము చొప్పన పాటలు బయలువెడలునంతకాలము, కల్పనాశక్తి, స్వకీయరసానుభవము స్వీయరాగములు, తాళజాతులు, వీనికి తావు లేకపోవుట తటస్థించును. నాటకములందు ఆయాప్రదర్శనీయవ్యక్తికి దగిన పాటలు రసానుభవముచొప్పన వెలయింపనిచ్చగల కవులు సంగీతము నెఱిగి, రాగరసము ననుభవించి, తాళము గుర్తించి వీనిని వెలయించునప్పుడే అయ్యవి సహ్యములై రసోద్బోధకములై ప్రేక్షకులమనంబుల నరికట్టి యుర్రూతలూగించి సంగీతమహిమను వెల్లడించగలుగును. అపుడే నాటకములు స్వీయదేశీయములై ఆంధ్రవ్యక్తిత్వమును చాటగలవు. సంగీతము కర్ణాటకఫక్కి నొప్పియుండును. నటులతోబాటు కవులకును సంగీతమునెడ శ్రద్ధాభక్తులు కావలసియున్నవి. అట్టికవులహృదయమునుండి త్యాగరాజు, రామదాసు మున్నగువారినుండి కలిగినట్లు పాటలు, కీర్తనములు సమయానుకూలముగ స్వకపోలకల్పితములై తమవ్యక్తిత్వమును చాటుచు వెలువడగలవు. నటులును గానశాస్త్ర మెఱిగి, రాగరసము నెఱిగి, హృదయరంజకములగు రాగముల లక్షణాన్వితముగ పాడునంత ఆంధ్రదేశపువ్యక్తిత్వమును నిలువబెట్టగలుగుదురు. ఇంతకు హెచ్చరింపబడుచున్నారు.

సంగీతమునకు దాళము ప్రధాన మనుటకన్న ప్రాణ మనుటే మేలని భారతీయులమతము. పాటలమాధుర్యము రసోత్పాదనతాళము ననుసరించియున్న దనుట నిరూపింపవచ్చును. విలంబకాలమున పాడునప్పటిరసమునకును ద్రుతకాలమున నొప్పించునప్పటిదానికిని వ్యత్యాసము కలదు. కర్ణాటకగానమున నీసంగతులు పాటింపబడుట సంగీతజ్ఞులు తెలియుదురు. ఇందుచే నూలాదిసప్తతాళములు, లఘువుయొక్క త్రిశ్రాదిభేదములచే గలుగు ముప్పదియైదుతాళములు గ్రహింపబడుట విదితము. ఇన్నితాళములు చాలకకాబోలు ఉత్తరహిందూదేశపుతాళములు, వీనియందలి యంగములు పెక్కురు తెలియకపోయినను వానిని నాటకములందువలె ననుకరించుట యసభ్య మని యెంచుదురు.

ద్రుతానుద్రుతలఘువుల నొప్పించి క్రమముగ జెప్పుటకు మనమృదంగము ఘనతగాంచినది. అందుచే గర్ణాటకగానమునకు మృదంగము ప్రక్కవాద్యముగ నంగీకరింపబడుచుండెను. హిందూస్థానీగానమున నీవిధమగు తాళము కాక చిక్కతాళము ఖాలీఘాతలతో నొప్పించి భిన్నమగునట్లు రెండుమూడువిధములు లెక్కించుటయు వీనిని చెప్పుటకు తుదివరకు ఒక్కవిధమగు శబ్దములను (బోలులు) పల్కించుటయు విదితము. ఇందుకు తబలా తగియున్నది. వారిపాటలు నందుకనుగుణముగ జేయబడుట విదితము. తబలా తాళమును, అక్షరసంఖ్యను తెలుపుచు బోవును కాని మనమృదంగమట్లు తాళమును కొలిపించియు శ్రవణానందకర మగు పెక్కుశబ్దములను బల్కుచు కీర్తనను మక్కికిమక్కిగ ననుకరించుట గ్రహింపము. కావున కర్ణాటకగానము రంగములందు తలయెత్తునప్పుడు మృదంగ మావశ్యక మని చెప్పుట యొప్పగు.

మరియు నాటకములం దుచితమైన తావులలో ప్రదర్శింపవలసిన ఆయావ్యక్తికి దగినట్లు రసము నీరసము కానివిధమున నందందు శ్రీత్యాగరాజు, రామదాసు, దీక్షితులు, శ్యామశాస్త్రి మున్నగువారి కీర్తనములు పాడుటయు నావశ్యక మగుచున్నది. ఇందుచే నాటకములు గానప్రదర్శనాశాల లగునని భయము లేదు. రాగరసము నెఱుగక, తాళవిన్యాససరళత్వము తెలియక, ఏదేశమువారిపాటలో ననుకరించి, స్వకపోలకల్పనను తరిమివైచి, యల్లబడిన పాటలకన్న పైవాగ్గేయులపాటలు రంగములం దుచితమయినతావుల రత్నములై విలసిల్లగలవు. మననాటకరంగములు గానమును విడనాడనిచో నీయంశములు పాటింపబడుట యెంతేని యావశ్యక మగుచున్నది. కాని సంగీతము వల దనువారికి మేము చెప్పునది లేదు. పద్యములు, పాటలు రంగములం దావశ్యక మగుచున్న దని చెప్పువారిని మేము కోరునది తమ యాంధ్రవ్యక్తిత్వమును చాటుకర్ణాటకసంప్రదాయానుగుణమగు రాగములు, తాళములు, వాద్యములు నొప్పించుట భావ్య మని యెఱిగి యట్లు వాని నాదరింపవలె ననునది.

ఇందుచే నాంధ్రరంగములందు తంత్రీవాద్యములు— తంబూర, ఫిడేలు మున్నగునవి— తిరిగి పాడనూపుటకును, తబలవాద్యమునకు మాఱుగ మృదంగము వాడబడుటకును, కేవలము ఉత్తరదేశపురాగములుకాని, కర్ణాటక రాగములు కాని ఆయాకట్టుబాట్లు, సంప్రదాయము, శాస్త్రముచెప్పున నలవడి రంగములందు పాడబడుటకును, ఆవశ్యక మగుట గ్రహింపవలసియున్నది. దక్షిణదేశపు రంగస్థలములందువలె సంగీతము తోసిరాజుగాకుండ నియమితవిధమున రసపోషణకై భావానుగుణముగ నుండవలయుననుటయు దథ్యము. ఇందుల కాంధ్రనటీనటుల తోడ్పా టావశ్యక మగుచున్నది. కావున వీరు అట్లు సంగీతము నభివృద్ధికిదెచ్చుటకు బాధ్యులగుచున్నా రని హెచ్చరించుచు విరమింతును.

# నేటి నాట్యకళ పరిశీలనము

టి. రాఘవాచార్యులు

ఆంధ్రదేశమునందును, తదితరప్రాంతములలోను అనేకములైన నటసమాజములు, నాటక ప్రదర్శనశాలలు లేవా యనిన ఉన్నవి. కాని సమస్తకళలకు నిలయమై, నాటకసంఘమని చెప్పుకొనదగిన సంస్థ మనదేశమున మచ్చునకైన లేదు.

నాటకకళ కావశ్యకమగు వివిధములగు సుకుమారకళలను సమీకరణమొనరించి సంపోషింపగలసంస్థ నాటకశాల. తెలుగుదేశమునందు మిక్కుటముగా నాటకసమాజములు, కొన్ని ప్రదర్శనశాలలు కలవనుట నిక్కువమే. ఈనాటకకళయం దుత్తములుగ పరిగణింపబడిన స్త్రీలును, పురుషులును పెక్కండ్రు ఆంధ్రదేశమునం దున్నారనుటయు అతిశయోక్తికాదు. ఐనప్పటికిని, నాటకసంఘసంస్థాపనము, నాటకసంఘనిర్వహణమును కేవలద్రవ్యాపేక్షచే జరుగుచున్నది గాని, జాతీయోద్ధరణమునకుగాని, కళోజ్జీవనమునకుగాని అందు తావులేకున్నది. నిర్మోహమాటముగ నేనాడు మాటలకు క్షమింతురుగాక. తెలుగునాటనున్న నేటినాటకసమాజములు నూటికి తొంబదితొమ్మిది, ఆంధ్రప్రజల రూకలను సంగ్రహింపుటకేర్పడినవే గాని ఆంధ్రులకళాకౌశలమును, కళాభిజ్ఞతను సంగ్రహింపజాలినవి కావు.

ధనము! ధనము! ధనము!! ఇదియే ఈనాటి నాటకసమాజనిర్వాహకులకు తారకమంత్రము. పగలు రాత్రి యనక ధనార్జనకై పరిశ్రమించు వ్యాపార నాటక సంఘములు దేశమంతటను నిండియున్నవి. యుక్తాయుక్త విచక్షణ చేయజాలని మధ్యతరగతి ప్రజలను, మంచి చెడ్డ లరయజాలని జనసామాన్యమును ఈ వ్యాపారసంఘములచే కొల్లగొట్టబడుచున్నారు. విద్యాధికులమని భావించువారుసైతమీభ్రాంతికి లోనగుట సంతాపకరము. బాహ్యాడంబరములు, తళుకు బెళుకులు, పైపై మెరుంగులును అమాయికప్రజాసముదయము నాకర్షించును. సామాన్యజనులకు కాంతిగలదంతయు కాంచనముకింద లెఖ్ఖ. వ్యాపారనాటక సంఘములేగాక, ప్రోత్సాహిక నటులు (అమెచ్యూర్సు) సైతము అపరిణతబుద్ధులగు నీప్రజల యభిరుచులకు తగినట్లే ప్రవర్తించి, నిర్వాహకులకు ధనము సమకూర్చ జూచుచున్నారు. అది యటులుండ, సంగీత ప్రభావ మిపుడు నాటకకళను పొగవలె నావరించుకొనియున్నది. ఈదేశమున నాటకమున కరుగు సామాన్యప్రేక్షకుడీ సంగీతమనెడి సమ్మోహనాస్త్ర ప్రయోగముచే చేష్టలుడిగి, తన్మయుడై పోవుచున్నాడు. గానమునకు గల సమ్మోహనశక్తి అపారముకదా!

జనుల నాకర్షించి, ధనమును గుంజుకొనుటకు వ్యాపారనాటక సంఘము లీసమ్మోహనాస్త్రమును సర్వదా ప్రయోగించుచునే యుండును. నిజమగు అభినయకళకు తిలోదకము లివ్వబడినవి. నాటకరంగమున అభినయ మపురూపమైనది. సంగీతమే సర్వము తానయైనది. చక్కగా పాడినచో సరసముగా అభినయించెననియే భావింపబడుటను నే ననేకమారులు అవలో

కించి యుంటిని. కళాపరిషత్తులు సైతము ఉత్తమమైన అభినయమునకును, ఉత్కృష్టగానమునకును భేదమును పరిగణించి ప్రత్యేకమగు స్థానమొసంగజాలకపోవుట విచారహేతువు. వారి దోషములకు వారు కావించు ప్రదర్శనముల ప్రకటనలే సాక్ష్యము. ఈ దుర్భ్రమవలన గలిగిన చెడు గింతింత యన వీలులేదు. ఈ కతముననే, తుదకు అభివృద్ధినాశించు ఔత్సాహిక నటుడు సైతము సమయాసమయములు పాటింపక సంగీతము నాశ్రయింపవలసినవా డగుచున్నాడు. రంగముపై సంగీతములేదా, గల్లాపెట్టెలో ఎర్రనియే గాణి యుండదు. ఔత్సాహిక నటుడు సైతము మానవమాత్రుడే. నాటకమాడిడబ్బుగడింతుమన్నకాంక్ష అతనికి లేకపోవచ్చును. కాని తన ప్రదర్శనము చూచుటకు భవనమునిండుగ ప్రేక్షకులైన నుండ నపేక్షించును గదా. త్రికరణముగా తానొనరించు ప్రయత్నమును పత్రికలు ప్రోత్సహింపవలెనని యాతడు కాంక్షించును. అట్టితరి ప్రేక్షకులును, పత్రికలునుగూడ తమ ప్రశంసను, ప్రోత్సాహమును పాడెడి వానివైపునకే బరపుటచే అభినయముపై దృష్టిగల ఔత్సాహిక నటుడు ఆశాభంగముచే పరితపించును. తుదకాతడు గత్యంతరములేనివాడై, తననాటకమున పాటలను, పద్యములను చొప్పించును.

అందువలన దుష్ఫల మనివార్యమే! ఇక నీ వ్యాపారనాటకసంఘములవారిచే రంగస్థలమున ప్రయోగింపబడెడి సంగీతమెట్టిదో యోచింపుడు. అది సర్వసంకరము. శ్రుతికిని, లయకును కడుదూరము. శబ్దమేగాని యందు శ్రావ్యత యుండదు. ఇందునుగురించి, నేనధికముగా చెప్పబనిలేదు.

విద్యమాన నాటకరంగమున కళాపాటవము గగనకుసుమము. ధనాశాపిశాచము దశముఖములతో తాండవమాడుచున్నది.

అట్టి నాటకసంఘములు తాము నాటకములను ప్రదర్శించు నాట్యమందిరముల విషయమై ఎట్టిశ్రద్ధ వహింపజాలుదురు? నేడు మననాటకము లాడబడు నాటకభవనములస్వరూప మెట్టిది? ఆరోగ్యమే భాగ్యమను సూత్రమునం దీనాటకభవననిర్మాతలకు విశ్వాసములేదు. పరిశుభ్రత యనిన వారికి కిట్టదు. గాలి, వెల్తురు లీభవనములలోనికి ప్రవేశించుటకు వెఱచును. కళానుగంధ మీ నాట్యభవనముల దాపునకు రారాదు. వేషధారణమున కేర్పడిన "గ్రీన్ రూమ్" నేతిబీరకాయచందమున నుండును. ఒక్కవేషమునకైనను చక్కని దుస్తులమర్చుకొనుటకు ఏర్పాటులుండవు. స్త్రీలమాట యటుంచి, కొంచెము ఉత్తమలక్ష్యములు కలిగిన పురుషు డెవ్వడుగాని సంతసముతో ఈ గ్రీన్‌రూమునం దడుగిడజాలడు. ఆ గదిచుట్టును గోడలపై బొగ్గుతో వ్రాసిన బొమ్మలు నిండియుండును. కావున దానిని గ్రీన్‌రూమ్ అనుట కంటె డార్కురూమ్ అనుట యుక్తము. గాలివెల్తురులు లేని ఈ చీకటికొట్టులలోబడి మగ్గువారలచెమటదేహములనుండి వెలువడు సుగంధముతప్ప వేరొక కళాగంధము లభింపబోదు. నీవు ధరించువేషమున కేవస్త్రాభరణములను దాల్పవలెనో, ఏవర్ణ మలదుకొనవలెనో సూచింపగల దేదియును గ్రీన్‌రూమునందు నీ కగుపించదు. అవిగ్గులు, ఆ పెట్టుడుగడ్డములు, మీసములు చూచినంత ఒడలు జలదరించును. ఇక ఆగదియందు అద్దములు, దీపములు అమర్చబడిన

తీరందమూ, నటుడు తన మొగమును తాను స్పష్టముగా అద్దమున చూడగెంచినచో సర్కసులో వలె మొగ్గలను, పల్టీలను వేయుట నేర్చుకొనవలెను. కడపట తెరదించినతరువాత రంగులు కడిగివేయుటకు నీళ్లు, సబ్బులు దొరకుట పేదవానికి పెన్నిధి లభించినటులె.

ఇక రంగస్థల మెటులుండునో విచారింతము. రంగమధ్యమునిండా కన్నములు, పగుళ్లు, నున్నపు గీతలు, బొగ్గ రాతలు, తెరలపై చిత్రింపబడినవి అరణ్యముకావచ్చు, అంతఃపురము కావచ్చు, లేక కేవల మావైకుంఠమే కావచ్చుగాక—పెయింటరు నామాక్షరములు మాత్ర మాంగ్లమున మనకనులయెదుట ప్రత్యక్షమగుచుండవలసినదే! రంగముపై దీపకాంతు లత్యద్భుత ములు. ఒకప్పుడు నటుడు కానరాని కటికచీకటిలో నుంచబడును. వెనువెంట నే కనులుండియు అతనిని గ్రుడ్డివానినిగా చేయునట్లు పచ్చలైటు ఎర్రలైటు పిచికారితోవలె అతని ముఖముపైకి చిమ్మబడును. సభ్యులు కూర్చుండు సభాభవన మిక చెప్పబనియే లేదు. ఇదియొక సరుకులువేయు గిడ్డంగి; గొడ్లకొష్ఠము; పిల్లల అరుపుల చేతను, సోడాబుడ్ల వికారధ్వనులవల్లను సంగీతము, వాచకము మొదలైన శిశువులు వధింపబడెడి వధ్యశాల. ఇంతేకాదు. ఆకుబీడి సిగరెట్టులమ్ము వాని కేకలు అనివార్యములు. ఏ నటుడుగాని యొకింత భావించి తన పాత్రధర్మమును నిర్వర్తింపవలెనన్న ఇట్టి పరిస్థితులం దెట్లు సాధ్యమగునో నాకే వింత గా నోచును.

నాటకకళ కనుబంధములగు లలితకళలన్నియు అభివృద్ధి చెందగల, సర్వాంగశోభితమగు నాట్యమందిరమును నిర్మించుట మన ప్రప్రథమ కర్తవ్యము. మన పూర్వీకుల వస్త్రాలంకరణ ములు, వా రుపయోగించిన ఆయుధాదులు మొదలైనవానిని ప్రదర్శించు ప్రాచీనవస్తు ప్రదర్శన శాల యొండు దీని కనుబంధముగా నుండవలెను. వర్ణసంకలనమునందును, దీపకాంతులను ప్రయోగించుటయందును పరిశోధనలను సలుపుట కొక పరిశోధనాలయ ముండవలెను. ప్రాచీనములును, ఆధునికములునైన వివిధదేశములకు సంబంధించిన నాటకములు, నాట్యగ్రంథము లుండెడి భాండాగార మొకటి యావశ్యకము. నటులకు, ప్రేక్షకులకు తేజమును కలుగజేయుటకు అనుకూల వాతావరణమును సృజించి, వారి చిత్తములను పల్లవింపజేయుటకుగాను, గ్రీసు రోమునందును, సభాభవనమునందును ప్రసిద్ధులగు చిత్రకారులయొక్కయు, గాయకుల యొక్కయు, నటులయొక్కయు చిత్రపటము లమర్పబడవలెను. ఈ సందర్భములో బాల బాలికలకు ప్రత్యేకనాటక భవనమూ, ప్రత్యేకమగు నాటకములును ఆవశ్యకములని మనవి చేయుచున్నాను.

ప్రదర్శనానుకూలములగు నాటకములను సమకూర్చుట ముఖ్యము. రెండువందలమంది ఉత్తమ నవలారచయితలందు చక్కని నాటకము వ్రాయజాలినవా రొక్కరుండవచ్చునని ఒక ఆంగ్లవిమర్శకుడు వక్కాణించెను. నాటకరచన సులభసాధ్యముగాదు. రసవంతమగు, కళావంతమగు నాటకమును రచించుట కెన్నియో చిక్కులు కలవు. ఒకరి జీవితపర్యంత మాక్రమించియుండు గాథలన్నియు, ఆ వ్యక్తియొక్క జీవితములోని ప్రధానాంశములను చిత్రించజాలునట్లు కొన్నిగంటలకాలములో సమన్వయింపబడవలసియుండును. నాటకమునం దభినయమే ప్రధానము. కాలము పరిమితము. నాటకమునందు సామాన్యముగ వర్ణన లప్రస్తుతములై

యుండును. నాటకరంగానుకూల్యములను నాటకకర్త మనమందుంచుకొనుట అత్యంతావశ్యకము. నాటకముహ్యంగ్యప్రధానమై యుండవలెను. చరిత్రను వివిధములగు అంకవిభజన, రంగ విభజనచేసి, సంభాషణరూపముగా రచించిన మాత్రమున నాటకమనిపించుకొనదు. కథచెప్పుటయును కాదు. ఒకవ్యక్తి జీవిత శకలమును కొన్నిభాగములుగా కత్తిరించి ప్రదర్శించుటయును కాదు. లేక మన మనుదినము కనుచుండు సామాన్యవిషయముల నేకరువుపెట్టుటయును కాదు. రాసాయనిక శాస్త్రజ్ఞానియొక్కగాని, గణితశాస్త్రవేత్తయొక్కగాని, మరే శాస్త్రప్రవీణుని లెక్కకు సరిపోవలసినది కాదు నాటకము. అదియొక యపూర్వమగు కళావిలసనము; ఆనంద సంధాయకమగు కళా సంప్రదాయము. కళావేత్త లోకమునకు వెల్లడిచేయదలంచు భావములను రసోపేతముగ ప్రకటింపజాలిన మహత్తరమగు శక్తి అందుండవలెను. ఈ కాలమునందలి కవులు, నవలారచయితలు, చరిత్రకారులు, పత్రికారచయితలు దనేకులు నాటకకర్తలుగా నుండుట మానుకొనుట వారికిని, కళకును శ్రేయస్కరము. సాహసించి నేనాడినమాటకు నన్ను మన్నింతురుగాక! శతఘంట కవనము చెప్పినట్లు నూరుపద్యములను ధారావాహికముగా వ్రాయజాలినంత మాత్రమున నాటకముల రచించుట కర్హుడు కాజాలడు.

అందుచే ఉత్తమనాటకములను ముందు మన మాయత్తముచేసికొనవలెను. ఇల్లువాకిలి ఏర్పడినపిదప భుజించుటకు శుచియైనట్టియు, రుచికరమైనట్టియు పదార్థముండవలెను. పిమ్మట వండినపదార్థమును వడ్డించువారు కావలెను. వారే నటకులు. నివసించుటకు చక్కని యిల్లు, జిహ్వాకు రుచిగలభోజనము, వడ్డించుటయందు నేర్పరులైనవార లేర్పడినంతనే జీవితమహోత్సవ మతివైభవముగా నారంభమగును. వీని నన్నిటిని సమకూర్చుటకు ధన మావశ్యకము కాదా యని మీరు ప్రశ్నింపవచ్చును. ఇంతధన మెందుండి రాగలదు? మనదేశము దరిద్రదేవత కావాసముకదా. ప్రజ లొకపూటకైన గంజిలేక అల్లాడుచున్నారుగదా! ఒకవంక క్షామము, వేరొకవంక కలరా, ప్లేగు మొదలైన వ్యాధులు, మరొకట తలకుమించిన దుర్వ్యయము జనులను పీడింపుచుండ ధన మెందుండి వచ్చును అనవచ్చును. నిజమే కాని, మనకు కావలసిన దంతగా డబ్బు కాదని నే తలంచుచున్నాను. ఆంధ్రదేశములో నొక దివ్యమైన నాటకశాలను, నాటక సంఘమును ప్రతిష్ఠాపన చేయుటకు మనకు కావలసినది బుద్ధిమంతులును, దృఢసంకల్పులును, దీక్షవహించిన కొలదిమంది స్త్రీలు, పురుషులుననియే నా తలంపు. ముందు మన యాత్మ పరిశోధన కావించుకొనవలెను. అట్టిసంస్థయొకటి ఆవశ్యకమని త్రికరణశుద్ధిగ మనము భావించుచున్నామా? అట్లు భావించుచుంటిమేని—నిక్కముగా భావించుచున్నామనియే నేను నమ్ముచున్నాను—మన సంకల్ప మీడేరుటకు సాధనములు లభించితీరును.

# చతుర్థ

# ఆంధ్ర నాటకకళాపరిషత్తు

## అధ్యక్షుల ప్రసంగము

**నాట్యకళా పరిషత్తు**

చాలకాలమునుండియు నాట్యకళాపరిషత్తు నొకదానిని నెలకొల్పు జతనములు మన యాంధ్రదేశమునందు జరిగినట్లు తెలియుచున్నది. భారతీతీర్థవర్ధంత్యుత్సవములలో నాటకకళనుకూర్చి కొన్నికొన్ని సమావేశములు జరిగినవి. 1924-వ సంవత్సరమున బ్రహ్మశ్రీ తిరుపతి కవుల యాజమాన్యముక్రింద నొకసభ జరిగినది. తరువాత 1927-వ సంవత్సరమున నెల్లూరు నాగరాజరావుగారి యాజమాన్యము క్రింద మరియొకటి జరిగినది. ఏదో విధమున నీబీజము కొంత యాందోళనలో నాటబడినదని చెప్పవచ్చును. వర్షములు లేక నీరములు కొఱతపడి యది వృద్ధిజెందక గుజ్జువారెను. 1929-వ సంవత్సరమున నిజరూపముతో నట్టి పరిషత్తు తెనాలి పురమున జరిగెను. ఈ పావనాంకురము కృషి చేసి నీరములబోసి కార్యరూపమున జయప్రదముగ కొనసాగించినది సురభినాట్య మండలివారు.

క్రిందివత్సరము రాఘవాచారిగారి యాజమాన్యమున నీ సభ కడుశోభాయమానముగ జరిగినది. స్త్రీలు, పురుషులు, వేవేల కళాభిలాషు లెల్లరును నొక వాంఛనీయమైన దృశ్యమును వీక్షించిరి. కళాబాలిక నూతనోత్సాహముల నెన్నిటినో పురికొల్పినది. నూతనాదర్శములు పురికొల్పబడినవి. ఆంధ్రభూమి నంతటను అలజడి కొంతవరకు కలిగినది.

**నాటకకళా పరిషదుద్దేశ్యము**

ఎన్నివత్సరములనుండియో యిట్టి సభానిర్మాణావశ్యకతను పురికొల్పుచున్న విషయము ప్రస్తుతము నాటకకళ యనుభవించుచున్న యధఃపతనము. అద్దానికి కారణము లివ్వి యని తోచుచున్నది.

1. అసర్వప్రాయములైన ఉత్తమ నాటకములు బహుళముగ లేవు.

2. శుద్ధనవీన దృష్టినైనను, శుద్ధ ప్రాచీన దృష్టినైనను, లేక నీరెంటి సమన్వయముల నైనను, కావ్యముల రచించు కవులసంఖ్య తక్కువ.

3. రాజకీయ పరివర్తనలవల్లను, దేశపరిస్థితులకు స్థిరభావము లేకుండుటవలనను నటుల యందును, సామాజికులయందును నిశ్చితాదర్శములు లేక పోయినవి.

4. ఆంధ్ర నాటక రంగస్థల చరిత్ర చాల వెన్నమొన్నటిదైనను, ఒకటి రెండు శతాబ్దములలో వచ్చు మార్పులు ఉక్కిరి బిక్కిరిగ నీ స్వల్పకాలములోనె కలిగెను.

5. ఆర్థిక దుర్భిక్షము దేశమునందంతట విహరించుటవలన "ధనమూల మిదం (రూపక) జగ" త్తయి పోయెను.

**నాటకకళ**

ఇది యీ లోకమున నెపుడుద్భవించినదో చెప్ప వీలులేదు కాని ఆదాము ఈవుదంపతుల తరువాత పుట్టినదని గట్టిగా చెప్పగలను. దీని కోగతించిన విషయ మవసరమగుచున్నది. అది నిత్యానందదాయకముగను, స్మరణమాత్ర విజ్ఞానదాయకముగను నుండవలయుచున్నది. మానవజాతి అన్ని రసములను, చరాచర ప్రకృతి సౌందర్య గ్రహణశక్తులను ఆవృద్ధదంపతులనుండియే గ్రహించినది. వారి చరితము మనకు స్మరణీయము. మహాకవి మిల్టను దాని నొకకొంత నాటకరూపమున నే స్మరించెను.

కర్మ పరంపరల చిక్కి, మానసిక, శారీరక దుఃఖముల గ్రస్గిగ్రమగ్గు మానవునకు రెండువిధముల నవనయములు ప్రసాదింపబడినవి. ఒకటి వేదాంతతత్వచింతనచే సృష్టికర్తను చేరుట; రెండు అనంతసృష్టి స్మరణము, నద్దాని చారిత్రస్మరణమును. వీటివలన గలుగు మనఃపరివర్తనములే సుఖదుఃఖవ్యత్యాస భావములను, నిత్యానిత్యత్వములను, పరిణామములను ధ్రువపరిచి శాంతినిచ్చుచున్నవి. శుద్ధమైన చారిత్రరచనకుకూడ నాటక రచనకుండు నాశయములే యలవడుచున్నవి.

ప్రపంచమున ప్రథమనాటకము ఒకానొక దుఃఖభాజనునకు మరొవ్యక్తి ఒక సాదృశ్యము చెప్పి అపనయ మొసంగినప్పుడు రచింపబడినది. దాని జయమును వీక్షించి, వాచికమున కాంగికాభినయమును జోడించి ద్విగుణించెను. తరువాత సాత్వికమును స్వభావమును మరింత యనుకరించి దాని యాత్మను వెలిబరచెను. తరువాత నాహార్యమును జేర్చి పరిపూర్ణత చాలవరకు తేగలిగెను. కాని విజయకాంక్ష అలెగ్జాండరునకుబలె మరింత సాహసము కలిగించెను. కవిత్వము, సంగీతము, నాట్యము మొదలైన లావణ్యములజేర్చి మరింత మెరుగులు పెట్టెను.

తరువాత తన నిర్మాణవైశాల్యమున కచ్చెరువొంది, భేదభావ నిరూపణకు జంకి, తెర మీద ప్రతిమల నెక్కించి తావెనుకపడి నూత్నరసముల చిందించెను. రానురానిది పేలవమై తన స్వశక్తులమీద దెబ్బతీసి గేలిచేయ మొదలిడెను. వెంటనే కలాపమును మార్చి స్వీయనిర్వాహణలకే దృష్టుల సారించెను.

పదంపడి కార్యభారమువలననో, లేక ఔదార్య సద్భావములవలననో, తనవిజయలక్ష్మికి భాగధేయుల నేర్పాటుచేసుకొనెను. వారికికూడ తన యాశయములను భ్రమరకీటన్యాయముగ చేసెను. ఈ సమ్మేళనము రసమును మరింత చిప్పిలించి వినోదకరణమాయెను. నచ్చ చెప్పుటకుగాని, హృదయరంజనకుగాని, ప్రకృతిని హత్తించుటకుగాని యీడులేని, బలమైన ఆయుధమొకటి మానవునకు కైవసమాయెను. రానురాను ఈశస్త్రరాజము లభివృద్ధిచెంది అరాజకమేర్పడజొచ్చెను.

భరతముని లప్పు డుద్భవించి, యీ ప్రవాహములకు గట్లువైచి, భూతమాంత్రికులవలె నియమబద్ధలను జేసి సూత్రధారులైరి. నాట్యశాస్త్రము పంచమవేదమై బరగి చతుర్వేదముల నున్న సత్పదార్థమును లభ్యపరముకొని, దేవతలకును, మనుజులకును, అసురులకును లభ్యమై బరగినది. ఈ శాస్త్ర నియమములు జూచిన నేటి యిరువదవ శతాబ్దినేరికైనను ఆశ్చర్యవిస్మయములు జనింపకమానవు. దాన చెప్పబడని విషయ మేదియులేదు. నాట్యమంటపము కొలతలు మొదలు భటులుచేయు నాహార్యములవరకును, వేయేల, మనల నిప్పటికిని కలగుండు వెట్టు సమస్యలన్నియు చర్చింపబడి, సూక్ష్మబుద్ధితో పూర్తిజేయబడినవి.



శ్రీమతి శ్రీరంజని



రాగిణీదేవి నాట్యభంగిమము

***Courtesy Prajamitra.***

అన్నియు దైవప్రసాదములె గనుక యీ నాట్యవేదమును లోకకల్యాణమునకై భరత ముని ఆత్రేయాదులకు చెప్పినట్లును, మొదలిది పుట్టువులో మహేంద్రాదుల ప్రార్థనపైన బ్రహ్మ చేత ననుగ్రహింపబడినట్లును జెప్పబడియున్నది.

దీన లోకధర్మియనియు, నాట్యధర్మి యనియు రెండు భాగములున్నవి. వాటి సరిహద్దులు కూడ నేర్పరుపబడినవి. లక్షణములుకూడ సమగ్రముగ వివరింపబడినవి.

ప్రాచీనకాలముననె యీవేద మెంత యున్నతదశనుండినదో లభ్యములైన శాకుంతలం మృచ్ఛకటి, ఉత్తరరామచరిత్ర, రత్నావళి, ప్రియదర్శిక, మాళవిక, విక్రమోర్వశీయ నాటకములె ప్రబల తార్కాణములు. దేశ దౌర్భాగ్యముచే నింకెన్ని మహోత్కృష్టములైన కావ్యములు మాలవిధిగోతపడెనో లెక్కయే లేదు. శుద్ధవిషాదాంతములుకూడ ఉండెడివని చిహ్నములుమాత్రము కనుపడుచున్నవి.

అరిష్టాటిలు నియమములని వ్యవహరించు దేశకాలక్రియైక్యములు మూడును భరతుడు రచయితలకు శాసించినాడు. గ్రీసు విజ్ఞానికి త్రోవ పెట్టినది భరతుడే యగుచున్నాడు.

"ఇట్టి కళాసార్వస్యము ఇంత ప్రాచీనమే, కళ అంతవృద్ధిచెందిన ట్లానవాళ్లుకను కనుపడవే!" యని అడుగగలరు. నాకు తోచిన కారణములివి:

1. ఈవేదము సంస్కృతమున రచింపబడియుండుటచేత నాభాష · వివిధప్రాంతముల వారికిని సామాన్యముగ తెలియకుండెను.

2. ఇట్టి నియమబద్ధమగు వేదము ననుష్ఠించు కావ్యకర్తలుకూడ తక్కువపడిరి.

3. స్వాతంత్ర్యహీనమైన మాతృభూమి ఖిన్నయై ఎప్పుడును రంజకవినోదకరణములందు విముఖయయ్యెను.

4. రచనకన్న నాటకప్రయోగము మరింత కష్టముగనుండెను. తగినట్లు, ప్రేక్షకుల సంఖ్య కూడ నంతకన్న మరీ తక్కువగుచుండెను.

కావున నాటకకళాబీజము లెపుడును దేశమునందు నశింపక, అడ్డంకులకు ఉద్రేకములయి తలలువంచి క్రుంగుచునేయుండెను. దేశమున వివిధభాషలలో రచింపబడిన నాటకములకు మాతృక సంస్కృతనాటకము. భరతుని గ్రంథమే శాస్త్రమును, వేదమును. గొయిటీ పండితునికి నృత్యోన్మాదముల కలిగించిన శాకుంతలమువంటి నాటకరాజము ఇంతవరకు రచింపబడలేదే! భవభూతిఉత్తరరామచరిత్రవంటి మహాకావ్యము మరలనొకటి కానబడదే! మృచ్ఛకటికవంటి నందనోద్యానము మరియొకటి లేదే! ఇప్పటికిని కల్పనాసైపుణియందు భానునిమించిన కవిచంద్రుడు లేడె! ఏల మనము మూర్ఖులమనియు, ఆచారాధీనఛాందసుల మనియు, రసహీనులమనియు మోసపుచ్చుకొని, దేశమువదలి విదేశీయ విజ్ఞానవిపణులకు పోయి కొనితెచ్చికొనుటలు? ఆయుండుకొన్న విజ్ఞానమే చాలును, సరిగ నుపయోగించు త్రోవలు తెలిసినచో. మరియు నది సామాన్యముకూడ కాదు, లోకోత్తరమై ఆదర్శకమయినది.

నిషిద్ధములపట్లతప్ప హూణభారతమతములకు భేదములే కానబడవు. ఈయవి మన జాతీయ సంప్రదాయమునకు గౌరవముతెచ్చుటకుగాదు చెప్పబడినది, విశాలవిశ్వమానవజాతికి

కూడ సమాదరణీయములుగ నుండుటకు. రంగస్థలమున రతము తుచ్ఛదృశ్యమే, యుద్ధము కృత్రిమమే, మృత్యువు భావవికారముల గలిగించి వెగటుబుట్టించునే యివి నిషిద్ధములుకాక మరే మనవలయును? ప్రకృతి ననుకరించు నాటకాదర్శములకు నిట్టిహద్దు లుండకపోయిన మనము కూడ జంతువుల మగుచున్నామే. భీష్మించి, వీటినే పట్టుకొమ్మల చేసుకొని, ఔచిత్యములు మరచి, కథావస్తువును భ్రష్టము చేసి నాటకములను రచించి సమాజముమీద గుప్పుట పామర రంజకమేమొగాని పండిత హృద్యముగాదు. కళోపాసకులందరును భరతుని వేదము సమగ్రముగ జదివి, తమదేశ మెఱిగి, తమశక్తిని ప్రత్యక్షము చేసికొని, తమస్పృష్టులకు పురుగుబట్టకుండ నాటకనిర్మాణములు చేసిన నవి స్థిరములు, కీర్తిదాయకములు అగుచున్నవి.

**ఆంధ్ర నాటకోత్పత్తి**

ఆంధ్రభూమికేకాక వివిధదేశములవారికిని జాతీయనాటకములు వెలువడియుండిన కాలము మొన్న మొన్నటిదే. ఎంత నిడివిన చూచినను 60 వత్సరములకన్న నెక్కువజీవితము గడచినట్లు కానబడదు. మాతృస్థానము సంస్కృత నాటకమే యని తొలుత నే మనవి చేసితిని కాని నామకరణములు మొదలగు శుభకార్యములను చేయించి పుణ్యముకట్టుకొన్న పురోహితులు విదేశీయవిజ్ఞానులు. పెద్దల సాంగత్యములేక అనేకులవలె గుటకలాడు నవీనయువకుని పోలికపట్టియున్నవి. కాని పూర్ణముగా చెడిపోక భ్రాంతి మాత్ర మెక్కడనో ఇముడ్చుకొని త్రిశంకుస్వర్గ మనుభవించుచున్నవి. కాని అద్భుతమైన సంప్రదాయసిద్ధములు వెలువడుట లేదను. కాని వికృతములును, నామమాత్రములును ప్రస్తుతమున వందలకొలది వెలువడుచున్నవి.

కలసిన వస్తుసామగ్రియు, కల్పనానైపుణియు, రసనాళములును, ఔచిత్యానౌచిత్య వివక్షతయును మనసోదరులయందున్నవి. కాని కొంత నిప్పుకు కప్పినది. నునుపుసొంపు సౌకుమార్యములు చిందించి, రక్తిమగల తెలుగుబాస మన నాటకముల యందు ప్రవహించుచున్నది. నాటకాదరణీయములైన రసములు నన్నిటిని అనన్యసామాన్యముగ మనభాషయం దొప్పించవచ్చును. ఇది గర్వముకాదు. సహజసుసంపత్తుగలిగిన ఆంధ్రపండితు లింతకాలమునకే ఎన్నియో ఉత్తమ కావ్యముల రచించియుండవలసినది. కాని, అట్లు జరుగక ఇట్లు జరిగి, అధమకావ్యముల సంఖ్య ఎక్కువై, ముద్రణాలయముల పోషించుచు మిగులుచున్నవి. నాటక వాఙ్మయమున కిదియొక యరాజకమని చెప్పిన నతిశయోక్తి గాదు. ఇట్టి బుద్బుదప్రాయములు, సర్వశూన్యము లయిన చీకట్లు ఉత్తమకావ్యకర్తల అదృష్టోదయముల నిరీక్షించుచున్నవి.

ఆంధ్రనాటకము తోలుబొమ్మలాటలు, జంగంకథలు, భాగవతములు, యక్షగానములు మొదలగువాటినుండి పుట్టినదని చెప్పువా రున్నారు. క్రమాగతముగ పుట్టినదని వీరి యూహ. కాని నా కట్లుగా గోచరించుట లేదు. వీటితరువాత పుట్టినదని గాని, వీటి శకములయనంతరము పుట్టినదని గాని, పుట్టవలసి పుట్టినదని గాని చెప్పుకొన్న సమంజసమని తోచెడిని. తోలుబొమ్మలలో రచయిత నదీప్రవాహపుటొడ్డున నున్నాడు! జంగముకథలో మునికాళ్లు తడియువరకు దిగినాడు! భాగవతములో మోకాళ్లలోతునకు జరిగినాడు! యక్షగానములో మెడవరకు మునిగినాడు! నాటకములో మున్కనీటబడి ప్రవాహమునకు స్థానచలనము లేకుండ యెదురీదు

చున్నాడు ! ఫిలిములలో, టాకీలలో ప్రవాహమునబడి మునుగుచు తేలుచు పోవుచున్నాడని చెప్పెదను.

స్వభావప్రకృతి ననుభవించి అనుకరించుటలో నిట్టి భేదరంజక పరికరము లేర్పడినవి. ఎట్టి లోపములును లేకుండ ప్రకృతి నచ్చొత్తి దాని నాడించుటకు మానవుడు ప్రయత్నించుచున్నాడు.

ఇంక ప్రస్తుతము. పూనా, ధార్వాడ కంపెనీ లాగమనమే యీ బీజమునకు దోహదము చేసినదని చెప్పగా వినియున్నాను. నాకుకూడ నిజమని తోచెడిని. తరువాత గూటీమారుక కంపెనీ వచ్చి మరింత వింతగొల్పెను. తరువాత ప్రాతి సురభి కంపెనీవారు దీనికి ప్రచారము నేర్పరచిరి.

ప్రప్రథమమున కొన్ని నాటకములు గద్యాత్మకములుగనే రచియింపబడెను. అవి కొంత ప్రచారమును కూడ నుండెనని తెలియుచున్నది. తరువాత గద్యపద్యాత్మకములుగను, పదంపడి గద్యపద్యగీతాత్మకములుగను బయలుదేరెనని. ఆంధ్రనాటక పితామహుల నాటకములు ముందు మొదటిమార్గమున నుండి, తరువాత పద్యగీతాభాసములను గ్రహించినట్లు చదివిన తేలుచున్నది. గద్యనాటకములు రక్షించినట్లు అన్యులచేత కాదు. నటులయందట్టి చేతయుకూడ నశించిపోవుచున్నది, అట్టి పరిస్థితులలో

ప్రాచీనకాలమున తెలుగున నాటకములు లేవా యని యడిగిన నిశ్చితమైన యుత్తరము నివ్వలేను. ప్రబంధరచన యెంత అభివృద్ధికెక్కినను, ఎంత ప్రచారమున నున్నను, ప్రాచీనకవి సింహములలో నొక్కరైనను నొక నాటకము వ్రాసియుండరా యని శంకపొడముచున్నది. వ్రాసియు శిథిలములైనవా ?

నవీనమున ప్రథమాంధ్రనాటక మేదియోకూడ తెలియకున్నది. కాని, అట్టిది గోదావరిమండలమునందున, రాజమహేంద్రుని పురమున సన్నయభట్టారకుల యుగ రచియింపబడియుండెనని నాకు తోచుచున్నది. నిజానిజములు చరిత్రకారులనోట వినవలసియున్నది.

దీని విధానము విద్యమానకాలమున చాల నభ్యుగతి బట్టినది. ఉత్తమరచన లంతవిరళము లుగ లేవు. కాని కొలదిపాటిమాత్రమే యున్నవి. కవిప్రవరుడు ప్రతాపరుద్రీయము, వనరాయల వేణీసంహారము, తిరుపతికవుల నాటకములు,

నాటకరచన

పానుగంటివారి రాధాకృష్ణ, సుబ్బారావుగారి తులాభారము, సత్యనారాయణగారి నర్తనశాల, అప్పారాయల శుల్కము మొదలగు గొప్ప నాటకములున్నవి. కాని సంఖ్యతక్కువ. మధ్యమాధమరచన లెన్నియోకలవు.

నాట్యకళ మొదటిసంచికయందు నాయూహల కొన్నిటిని వ్రాసియుంటిని. నటకుడను గనుక యీ పెద్ద విషయమున సాక్ష్యమివ్వతగినవాడనే కాని అభిప్రాయమివ్వజాలను. ముఖ్యముగ నీ విషయము మహాపండితబృందము చర్చచేసి తీర్పుచెప్పి, కళాపిపాసువుల కెల్లరకును మార్గము చూపవలెను. ఇక కొన్నివిషయములు మాత్రమే పేర్కొని దీనిని విడచెదను.

1. నటకు డెట్టిదిట్టయైనను, ఎట్టి కొట్టివేతలకైన, ఎట్టి జొన్పుదులకైన వీలులేకుండ రచించిన రూపకములే యుత్తమములు.

2. ఇట్టి దొసగులు చేసిన, గ్రంథకర్త లా నాటకమును ఆ సమాజమునకు వెలివేసి బహిష్కరించు నధికారము ముద్రణముననే యుండవలెను.

3: దాన విష్కంభములు రచింపబడరాదు.

4. పద్యములు కాని, గీతములు కాని తగుమాత్రమే యుండవలయును. అవికూడ నందియుండనట్లు తోపజేయవలెను.

5. అపాయకరములును, వృథావ్యయదాయకములును, కేవల పామరద్రవ్యాకర్షకములును, అప్రయోజనములును నగు రంగములకు కాని, సీనులకు కాని ఆశ్రయమివ్వరాదు.

6. స్త్రీలే స్త్రీపాత్రల ధరింతురని దృఢనమ్మకముతో కావ్యముల రచించిన బాగుండెడిది.

7. ఉపనాటకములు, ప్రహసనములు నాటకమున రచింపరాదు. కథావస్తువు శోభ తగ్గెడిని.

8. భారత మతమునకును, పురాణమతమునకును కాలమానమును బట్టి వీలైనంత సమన్వయమును జేసి ఆర్యసంప్రదాయము వాసిపోకుండ కావ్యముల రచించుట సమంజసము.

9. రంగస్థలమున హాస్యరసపోషణ యింకను నటకుల కర్థముకానందున దానిని కొంతవడి నాటకముల తగ్గించుట సుకరమని తోచెడిని.

దీనిని పూర్వరంగస్థలము, ఉత్తరరంగస్థలము నని రెండు విభజింపవచ్చును.

**ఆంధ్ర రంగస్థలము**

పూర్వరంగస్థలము:—ప్రథమ నాటకరచనతో రంగస్థలచరిత్రకూడ ప్రారంభమైనది. మొదట ఖేలనముతో నొక క్రొత్తబీజము నాటబడెను. అదెప్పుడు జరిగెనో నే జూడలేదు కాని నానాల్గవయేట బందరు పురమున నే జూచిన సారంగధరనాటకమే నాకు మొదటిది. దాని పచ్చిదనము నాహృదయమున ఇంకను ఆరలేదు. ఆకాలముననే కూచిపూడివారి ప్రహ్లాదను జూచితిని. అప్పటికే (క్రీ. శ. 1900) యక్షగానములు ప్రబలముగా నుండెను. ఆంధ్రనాటక మప్పుడప్పుడే తొంగి చూడ మొదలిడినది. వీటి రెంటికిని కొంత సంఘర్షణకూడ జరిగియుండవలెను. ఆంగ్లభాషాపరిచయము వృద్ధియైన కొలదిని, దాన మన దృక్పథములు పరివర్తించిన కొలదిని నాటకమే జయించి ప్రచారము సంపాదించుకొనెను. కాని సమాజము మొత్తముమీద యీక్రొత్త రంజకత్వపు త్రోవలయందు అవిశ్వాసమును, నిరాదరణయు ప్రబలుచుండెను.

నాటకమాడుటగాని, చూచుటగాని వినాశహేతువనియు, ఆంగ్లేయుల పద్ధతియనియు, భాగవతములాడుటకాని, చూచుట కాని సనాతనపద్ధతి యనియు అపోహలుండెను. ఉత్తర రంగము ప్రారంభించువరకు నీ యూహలు చాలవరకు శమించి నాటకము దృశ్యార్హమనియు, దేశాభ్యుదయమార్గమనియు పరివర్తనలు కలిగెను. నాటకకవుల కంత తగులలేదేమో కాని, యీకళ జిడిముడి ప్రారంభములు అప్పుడే యుదయించుచున్న నటలోకమున కెన్ని తిట్టులు తెచ్చిపెట్టెనో, యెంత హైన్యమాపాదించెనో, యెంత వెలితీరులు కురిపించెనో మీకిప్పటికిని స్మరణీయమే యని తలచెదను. యూరపునందు Hugenots, Inquisition కాలమున నెన్ని కష్టముల బడిరో తత్తుల్యములను నటకులు పడిరి. వారిలో లోపములేమియు లేవని నేననను.

అవి క్రొత్త విస్తారములవెనువెంటవచ్చు విలక్షణములు. అట్టివి నాకన్నులకు కనబడవు. కళాపోషకు వారుచేసిన సేవలే నాకు గోచరములు. చక్కని నాటకము లంతగా లేకపోయినను ప్రఖ్యాత నటకు లెందరో ప్రబలియుండిరి. ఈమని లక్ష్మణస్వామిగారు, హరిప్రసాదరావుగారు, కోపల్లె హనుమంతరావుగారు, ముప్పిడి జగ్గరాజుగారు, ఇన్వటూరి వియ్యన్నగారు, అంకరాజు రామరావుగారు, జయంతి గంగన్నగారు మున్నగు నటశేఖరులు ఈ రంగస్థలము నలంకరించిరి. వారి నామముల స్మరించినంతనే గగుర్పాటు లొందమి కొంతఋణమును తీర్చుకొనువాడనగుచున్నాను. అట్టి యాచారము మన నాటక సమాజములలో మహారాష్ట్ర రంగస్థలమునకువలె లేవుకాని, వారి చిత్రపటములు నేపథ్యగృహమున నునిచి ప్రతినటకుడును మ్రొక్కించి నమస్కరించి ఆశీస్సుల నందదగినవి.

Rehearsal గది, Proprietor, Stage manager, నటకులు, ప్రాత Lit-Mar Lamp,
Harmonium, మృదంగము, కఠినశిక్షణ, విద్యార్థి నీతి చక్కని పాఠ్యము,
ఆకాలము ఆనందభైరవి, శహన, శంకరాభరణేత్యాది రాగములు, మంచి తాళలయజ్ఞానములు, రెండు మూడు మాసముల శ్రమము, చిన్నస్టేజీ రంగుకాగితములమీద బిరుదాముల నేకములు లేని Bulletin, రండో్ళ్ల వాయిద్యము-వెనుక ఒంటెద్దుబండి, గోడలమీద చేతితో వ్రాసిన Advertisement, నిర్ణీతకాలమునకు ముందుగనే నటకులు శ్రద్ధతో వచ్చి కూర్చుండుటలు, చాటున సిగరెట్లు బీడీల త్రాగుటలు, రూపాయకుర్చితో కొబ్బరికాయ, కర్పూరము, అద్దము మొదలగు రంగుల సంపుటియంతయు, శ్రద్ధాభక్తులతో గిరిజామనోవిహార యనునాంది, సూత్రధారుడు, వేషమండలు ముఖమున కట్టుకున్న మారిషుడు, తమ హక్కుల నెరిగి యిప్పుడంత గోలచేయని ప్రేక్షకులు, శిక్షాపాశముల బడి భయభక్తులతో నాడు ఖేలనము, మూడు నాల్గువందలకు మించని ఆదాయము, తప్పులున్న మానేజరుయొక్క తిట్లు, దెబ్బలు. పటము కొంత పూర్తిగనే లిఖించితినని ధైర్యము. నిరంకుశప్రభుత్వమని చెప్పిన నతిశయోక్తి కాదు కాని, అయ్యది లేకపోయిన నాఖేలనము లంత జయప్రదములుగ జరిగియుండెడివి కావు. నాటకమన అంత భక్తిశ్రద్ధలతో జరిగించునదే కాని యిప్పటివలె శిక్షణలేక, తారుమారుగ, రసహీనములైన ఖేలనములు కావు. సామాజికాధ్యక్షుడు, గరిడీవేత్త వారబాలికకు చిరుతతాడనములతో నృత్యము నేర్పినట్లు, అప్పటినటకులను తయారుచేసెడివాడు. ఇప్పటి మన దృష్టుల కా ఖేలనములు బాగుగ లేవందురేమొ కాని ఆకాలమున కవి చాల హృద్యముగ నుండెను. చిత్రనళీయము, శాకుంతలము, మదనవిజయము, బిల్హణీయము, సారంగధర, గయోపాఖ్యానము, పాండవనాటకములు ఆకాలపునాటివి.

ఉత్తర రంగస్థలము:—ఇది దాదాపు 1915 వ సంవత్సరమునుండి ప్రారంభమని నాయూహ. మైలవరం బాలభారతీ సమాజము, తరువాత శ్రీరామవిలాససభ, సీతారామాంజనేయ నాటకసమాజములు మొదలైనవి యెన్నియో దేశమున బయలుదేరెను. వీటితో నూతనశక మారంభమాయెను. అంతకుముందు కొంత స్తబ్ధుగానున్న కళ క్రొత్త వేగముల గలిగించుకొనెను. క్రొత్తక్రొత్తలో వలవట్టెను. పార్శీమెట్లు, గంధర్వపోకడలు, మిశ్రజాతి క్రొత్త రాగధోరణులు, పద్యములందు నూతననూతన భావపదవిభాగములు,

విరుపులు, శయ్యలు, మూర్ఛనలు మొదలగునవి వెల్లివిరియజొచ్చెను. ఆహార్యమున గొప్ప పరివర్తనలు జరిగెను. వెనుక చూపని పూసలచంకీకోట్లు మొదలగునవిపోయి, క్రొంగొత్త జల్తారులనీను దుస్తులు తయారుకాజొచ్చెను. పూర్వము వెన్నుత్రిప్పని నటుడు నిర్భీతిగ నిప్పుడు త్రిప్పగలిగెను. Grease paints, crepe hair మొదలగు హూణరంగస్థలపరికరములు దేశమున దుముకజొచ్చెను. రంగస్థలమున చిత్రలేఖనములు పార్సీ రంగస్థలము ననుకరింపజొచ్చెను. ఆంగిక, సాత్వికాభినయములందు క్రొత్త తళుకులు బయలువెడలెను. సినీమాల జూమట యెక్కువగుటయే దీనికి గారణము.

నాయికానాయకుల ప్రీతిఘట్టములయందు భారతీయ సంప్రదాయపు టాదరణము పోయి హూణపద్ధతులు అలవడినవి. ప్రవేశనిష్క్రమణములలో నృత్యకళలు దూరజొచ్చినవి. పూర్వమేమియు అభినయము చేయనివాడొకకొంత చేతిత్రిప్పుడుల అభినయమైన తెచ్చిపెట్టుకొనుచున్నాడు. నాందీసూత్రధారు లెగిరిపోయినారు. స్వారస్యమునకును, మునిసిపల్ కాల నిబంధన లనుసరించుటకును, ప్రేక్షకుల యుత్తరువులకు దాసోహమనుటకును గ్రంథములోని రంగములే మొత్తముగ ఎగురకొట్టబడుచున్నవి. కొట్టబడు Once more లనుబట్టి ఖేలనావిజయము కొలువబడుచున్నది.

ఇవి యెట్లయినను ఖేలనములందు క్రొత్త వెలుగులు, పోకడలు, సమ్మేళనములు, ఉత్తమాశయములును భావిశుభోదయ సూచకము లన్నట్లు రంగస్థలమునను కలిగినవి. పూర్ణమైన ఐక్యఖేలనములును, ప్రవాహధోరణి ననుకరించు దురితఖేలనములును ఈ రంగస్థలముయొక్క చిన్నతనములలో చూచియున్నాము. క్రొత్త ఆనందములననుభవించియున్నాము. ఆంధ్రరంగస్థలము ఉచ్చదశకువచ్చి ఎన్నికగల రంగస్థలములం దొక్కటై వెలుగగలదని యుప్పొంగితిని. కాని యది మూడునాళ్లముచ్చట యాయెను. పదేండ్లు గడచునప్పటికే దీనికి పతనదశ ప్రారంభమై యిప్పటికి పూర్తియైనది. దీనియుచ్చదశ నే చూచియుంటిని. ఇంకను ఆభంగిమ నామనోవీథి నంతర్ధానముకాలేదు. ఇప్పుడీకళ అగాధమునబడి ఛిన్నమై రూపుమాసి, గాసిచెంది "లా వొక్కింతయు లేదు" అని పఠించుచు నిట్టి పరిషత్తులకు విన్నపములను పంపుకొనుచున్నది. ఈ పతన దౌర్భాగ్యమునకు కారణములు మరికొన్నిటి నీక్రింద పొందుపరతును.

1. సమాజములు నశించిపోయినవి. "ఉన్న" వని ఏకరెననందురేమో కాని, అవి కేవల భ్రాంతిమంతములు.

2. బ్రతుకు జీవుడాయని యజమానులు (Proprietors) నటకులుపెట్టు యమయాతనల బడలేక త్రెంచుకొని పారిపోయినారు.

3. ఈ యాతనాప్రాణులు కంట్రాక్టరు లను వ్యక్తులయందు పరకాయప్రవేశమున దూరి, యిటీవల విశ్వనాథ కవిరాజాగారి "నేపథ్యమున" వారి కర్మముల ననుష్ఠించుచు, ఇతరుల ననుష్ఠింపచేయుచున్నారు.

4. ఈవిచ్ఛిన్నతవలన నటుడు స్వాపేక్షితములకే యత్రులు చాచుచు, యుద్ధమున సైనికుని రీతి ఖేలనమున తానొకడును జ్ఞానదూరుడై, కలయిక, పొందిక, శోధలను చంపివైచి, అసందర్భ రామాయణములను, అతుకుల తపకలను రంగస్థలమున సృష్టించుచున్నాడు.

4. సినిమా టాకీలయందు అభినయము తిలకించి, పోల్చుకొను ప్రేక్షకులకు పెద్దవ్యత్యాసములు గోచరించుటవలన నాటకాదరణ తగ్గినది.

5. గ్రంథకర్తలకు కూడ ఫిల్ములకు వ్రాయుటయూ, లేక మరియొక క్రొత్తపంథ Gramaphone లకు వ్రాయుటయూ లేక రంగస్థలమునకా యను తటపటాయింపులు కూడ తటస్థించినవి. సృష్టికర్తను స్థాయిభావము పోయి యూగులాడుచున్నాడు.

ఇట్టింకెన్నియేని పరిశీలించి చూచిన బయలుపడగలవు. మొత్తముమీద రంగస్థల మీనాటికి నీచావస్థలో నున్నదని తెలుపుటకు వెనుదీయను. అపవిత్రమైన కళాదేవిని చూచిన "హృదయమా పతికి" యను పద్యమునకు ముందుండు చంద్రమతీదేవియాకారమే నాకు స్ఫురించుచున్నది. విషాద మప్పటికి పండి పక్వమైనది. అప్పటి యాపె స్థిరచిత్తమే యీ పరిషత్తునకు జీవగర్ర. పూదండపడి పరమేశ్వరునకు సాక్షాత్కరించగలదు. మరల చంద్రమతీహరిశ్చంద్రు లయోధ్యను రాజ్యముచేతురు. ఇట్టి యాశయే నన్నును మిమ్ముల నందరను నిచ్చటికి ఈడ్చుకొని వచ్చినది. ఈ శుభమునకు మారు పన్నుచున్న వ్యూహములను నిపుణముగను ఆతురతతో విద్యార్థివలె పరిశీలించుచుండెదను.

**నాటక మెక్కడ ఎట్లు చెడు చున్నది ?**

అన్నిటను చెడుచున్నది. అట్లు జరుగుచున్నట్లు మనము తెలిసికొనలేకపోవుచున్నాము. మంచియొక్క పరిణామము తెలియనందున చెడుగుయొక్క నిర్భాగ్యతను వీక్షించలేకున్నాము. గ్రంథకర్తృలోపమున నట్టునాటి మాట అట్లుండనిండు. లోపములులేని నాటక మెక్కడ చెడుచున్నది? ఎందులకు? ఈవిషయము చాల ముఖ్యము కావున విస్తరించి, దానినే క్లుప్తరీతి తెలిపెదను. కొంత ఏదో లోపములో నున్నందుననే యిట్టి విమర్శచేయ వీలాయెను.

**వాచికము**

గద్య: ఇదియే నాట్యమునకు మూలాధారము. దానినే కథ చెప్పబడి నడిపింపబడుచున్నది. పాత్రమున నెక్కుడుతావు వీనితో నిండియున్నది. నటుడు దీనినె వలసినంత గణనాథ స్థలతో నారాధించుటలేదు. రంగముమీద విజయము పద్యము ఫింపలాసు రాగములో విసరుటలు కాదు. ఆముందుగద్యము ఏభావరాగముల ననవలెనో, ఏస్థాయిలలో నెంత కఠినముగనో, సరళముగనో అనవలయు రీతుల కనుగొనుట. గద్యమునకుండు రాగము పుట్టుకతోడనే బుట్టి, సాధనలవలన నలవడి, ఔచిత్య ధనాగారముల తెరచు తాళంపు చెవ్వి.

నటుడు లిక్కడనే మొట్టమొదటి తప్పిదము చేయుచున్నాడు. "గద్యము ఎప్పుడుపోయి పద్యము వచ్చునా" యనియేకాని, "పద్య మెప్పుడు పోవునా" యని అనుకొనరు. చూడుడు సమాజముల క్రొత్తవానిని చేర్చుపద్ధతి! "ఈపద్యము చదవరా అబ్బాయి" అని అందుము కాని, "ఈగద్యనిక చదవరా" అని అనము. పూర్వమువలె గద్య పద్యములను పాఠ్యముచేయు

నలవాటు లంతరించి, స్వీయకవనధోరణులు రంగి మునపండిపోవుచున్నవి. వాచిక మింతయథోగతి నుండిన వినుచున్న శబ్దజాలములకు జీవనముపోయి, కథాశరీరము కుళ్లిపోవుటలేదా? నడక లేదు! వేగగమనములు లేవు! రసవాహిని కరుళ్లుకట్టి బీటవారుచున్నది!

ఇక మనముప్పొంగులూరు పద్యమెట్లున్నదో పరికింపుడు! భావ ప్రస్తారణలతో "గగనేందిరారామ" యను పద్యమును రీతుగనే యనినాడు; కాని యేదోకొంత కొరవడుచున్నది. అది యేది? ఆగద్గోలులో అర్థము సరిగ తెలియబడక రాగపుస్థాయిలనే అనుభవించినాము. "ఎంత కష్టముతోడనో కొంతవరకైన స్వాభావికతను చిక్కబట్ట గల్గినా" డని యీకు స్త్రీల చూచి యానందించుచున్నాము. దీనివలన సాత్వికాభినయములు వాసితగ్గి, వెలవెలపోయినవి. తగినట్లు రాగమాలించు సాంగధరుని చెలికాంద్రము, క్రిందనో, ఎక్కడనో చూచుచు, ఆకపోత దృశ్యమును తానుభవించక, మేళవింపును చెడకొట్టుచున్నారు. రసముచిందలేదు. గద్యమును రాగము పూర్ణముచేసినది. అంతయు ఒక చక్కని ధ్వని, గింగురు, హోరు. కపోతము కానబడ లేదు. అది చిత్రాంగియింటిపైనిదకూడ వ్రాలలేదు.

ఒక్కొకపాత్రకు ఒకొక్క స్థాయిలో వాచికము ననుష్ఠించు రీతిధోరణులున్నవి. వీటిని గమనించవలసిన భటుడు రాజును, రాజు భటుడును అగుచున్నారు.

వాచికము స్పష్టముగ నుండవలయును. చాపటగతిలో చివరవరుసలోవారికిగూడ వినిపించవలెను. వారు పద్యముల వినుటకేకాదు వచ్చినది; గద్యమునుకూడ విని కథ తెలిసికొనుటకు. ప్రస్తుతమున నాటకములలో సంగీతమే వారి కందచేయబడుచున్నది.

గద్గోలులు జరుగునప్పుడు వాచికమును పరుగులెత్తింపక నైపుణితో చిక్కబట్టి, కథావస్తువు చెడకుండ కొంత సచరింపవలెను.

ఇంత రొందులేల? వాచికమునంతటను స్వగతము నిర్వహించుట కష్టసాధ్యమైనదిగదా? దీనిని విచారింతము. చెప్పనీతి చెప్పిన నిదికుడ నందరను విస్పష్టముగ వినపడవలెను. బిగ్గరగ లోని యూహల నరిపించుట స్వగతము గాదు. అదియొక లోగొంతుతో కొంత ఆలస్యముతో, పెదవులు మెదపీమెదపనట్లుగను, చెప్పీ చెప్పనట్లుగను అనుష్ఠించవలయును. గ్రంథకర్త తెచ్చిపెట్టిన అస్వాభావికతను నచ్చట నటకుడు కప్పిపుచ్చవలసినవాడగుచున్నాడు. సాత్వికమునకు వాచికరూపమిచ్చి రచియించినది స్వగతము. సాత్వికాభినయము నారాధించునాతడే స్వగత

వాచికపుధోరణులందు ప్రేక్షకుల యాహ్లాదపూర్వకాంతరాయములను నటకుడు వినగూడదు. వినిన లైన్యమును దరిద్రమును చేసుకొనుచున్నాడు.

ప్రవేశనిష్క్రమణములందు వాచికము చెప్పరానంత చెడిపోవుచున్నది. మొదట రంగప్రవేశమునకుముందు ఆపాత్రకున్న పూర్వస్థితి భావవికారములు ఆతని ముఖమున తాండవించుటలేదు. రంగరంగమునం దాతడు అనుభవించుచున్న పరివర్తనలు ఐక్యరీతి తాండవింపక, భిన్నభిన్నములుగా కానబడుచున్నవి.

ఇంక నిష్క్రమణములో మరింత శ్రాద్ధయోగ్యముగా పరిణమించుచున్నది. యోగ్యము లైన పద్ధతులు తెలియక, పార్శ్వనడలు, హస్త విన్యాసములు, ఔచితి తెలియకుండ పచరింపబడు చున్నవి. కొద్దిపట్ల తప్ప, నిష్క్రమణమున సంగీతము లేదు. ఏదియో ఒక వికృతగుణమును స్థాపించుటకు సాధనము కాదిది: గ్రంథకర్త యూపిరితీసుకొనుచున్నాడు: అతని నీపట్ల బాధ పెట్టి బయటపెట్టకుడు.

వాచికమును ముగించినతరువాత నున్నది నటకుని కష్టము. దీనిని గుర్తెరుగువారు లేరు. నోరు మెదపుచున్నప్పటికన్న మెదపనప్పుడు ఎక్కువ అభినయము కావలెను. ఇది లేకుండుటయే నాటకములు చెడుటకు కారణము. గమనము చెడి, వేగముపోయి, ఖేలనము నిర్జీవమగుచున్నది.

ఆంగికము

ఆంగికము వాచికమునకు స్పష్టతనిచ్చి వ్యక్తీకరించునది. అందరు ప్రేక్షకులు తెలిసినవారగుచో, వాచికమునకు వ్యక్తత యేందులకు ? తెలియని కొలదిమందికా యిది అని ప్రశ్నించుకొందము. తెలిసినవారికికూడ నచ్చచేయుటకు ఏర్పడిన సాధనమిది. శరీరమున కుడియెడమల కట్టి బాంధవ్యమో వాచికాంగికములకు అట్టిరక్త స్పర్శగలదు.

ఇది నటకునకు ముఖ్యావసరము. ప్రాయశః ఒక్కరాజపాత్రములయందుతప్ప ఔచిత్యానౌచిత్యముల నెరిగిన నటకునకే యిది ఎంతవరకనుష్ఠించవలయునో తెలియుచున్నది. వివిధమైన ఆంగికాభినయము చేయకూడని రాజపాత్ర ముండదు. ఎంతైనను చేయతగిన నీచపాత్రముకూడ నుండదు. ఇది అతిమృదువుగా, విన్యాసముల కోమలముగా, "చొక్కపుం జనుగవ లీల" గూఢతయును, చాటుదనమును లేకుండ నుండవలయును.

ఒక్కొక పాత్ర కొక్కొక నడకతీరు లేర్పడియే యున్నవి, ప్రతిమానవునకు నున్నట్లు. సేవకుని నడక రాజు నడచినను, రాజునడలు సేవకులు స్వీకరించినను పాత్రపోషణ అడుగంటుచున్నది.

వర్తమానమున పాత్రములకు సహజములైన నడకలు తెలిసినవారు చాల తక్కువ. కృష్ణ నారదవేషముల నడతీరులు చూడుడు ! ఎంత వెగటుగా నున్నవో ? అవి ఎట్లని యడిగిన నంతగా చెప్పలేనేమో కాని, యివి మాత్రము కావనిగట్టిగా చెప్పగలను. వాటియందు గానకవిత్వ మాధుర్యభంగిమము లుండవలెను. ప్రవేశ నిష్క్రమణముల సారము నటు లాస్వాదించుటలేదు. ఇవి రంగములనేకాక అంకములనుగూడ నతుకుపెట్టుటంకపుపాడులు. నిజమైన నాటకము ఐక్యముల చిందునేకాంకమే గాన గ్రంథకర్త రచనాలోపములకు నటకుడు పూతపూసి ఐక్యమును తేవలసినవాడగుచున్నాడు. దీన లాడుగుబడిన రసమాధుర్యములు చవుకబారును. హరిశ్చంద్రుడు "వినువీథిఁ" అను అంకాంతపద్యముతరువాత నిష్క్రమణమునకు, "భక్తయోగిపదన్యాసి" అనుపద్యమునకుముందు ప్రవేశమునకు నతుకుపోగొట్టినవారు విశ్వేశ్వరునిగుడి తెనాలినుండియే చూచియుండవలయును.

ఇవికూడ కొంత ఉచ్చస్థితిని, కొంత నీచస్థితిని పొందియున్నవి. విస్తరభీతిచేత వీటి విషయమును ఇంతటితో వదలెదను.

ఆహార్య సాత్వికములు

మొత్తముమీద ప్రస్తుతనాటకఖేలనములు నలువదిపాళ్లు జీవరహితములుగనున్నవి. ఈకొరత తీర్పుభారము నటకులమీద పడియున్నది. శర్కరతో చేయబడు లడ్లు, ఎక్కడ చెడిపోయి, రుచిహీనములగుచున్నవో చెప్ప నెంత విమర్శనాసాధ్యమో ప్రస్తుతఖేలనములుగూడ నట్లే. దీని వికృతిని చూచియేయుండురు గనుక ఒక పటమునుమాత్రము చిత్రించి చూపెదను. వసంతసేన వానలో చారుదత్తు నింటికి నభిసరించు ఘట్టము. వాన కురియుచున్నది. చిమ్మచీకటు లలముకొనియున్నవి. మెరపులు ఝుళిపించుచున్నవి. తడువకుండ విటుడు ఛత్రమును పట్టియున్నాడు. నృత్యభంగిమములతో తన నడలను పోషించుకొనుచున్నది. హృదయైక్యములను పొందుటకు దీనమందగమనమున్నది. వాచికమును వస్త్రశ్రుతులతో మేళవించి పోవుచున్నది. అంతయు భావతరంగముల నీను ఒక హారు. హృదయము పారవశ్యమున నన్ను పరమాత్మ కీడ్చుకొనిపోవుచున్నది. ఒక గృహములోనుండి "రతిక్రై యిస్తు కట్టుకొని" అను పద్యమువగకును ఈ దృశ్యమును చూచితిని, చిత్రించితిని గాని యింక సరిగ చిత్రించినట్లు నాకు నమ్మకములేదు.

(1) బయట ప్రేక్షకులు నెమ్మదిగ నడచుచు నిశ్శబ్దముగా పోవుదురు.

ఖేలనము జయప్రదమైనట్లు గుర్తులు

(2) ఇది తుపానుతరువాత స్తబ్ధతవలెనుండును.

(3) అచ్చటచ్చట లోలోన "అత డొకయెడ కొంత చెడగొట్టెను" అను విమర్శనలు లీలగా సహృదయముగ ననుచున్నారు; లేదా ఏమియు ననకయే యిండ్లకేగుచున్నారు.

(4) గుణము మరునాటివరకును స్తంభించియుండి, నిద్రలోపోయెనని తోచెడిని.

(5) Once more ఒక్కసైనను కొట్టబడియుండలేదు.

(6) ప్రేక్షకులు తమ యానందముల నణచుకొని నిశ్శబ్దత చెడకుండ వర్తించినారు.

ఈ పైసూచనలన్నియు వేదశరగతిలోనున్న ఒక కుగ్రామవాసి నాకు చెప్పియున్నాడు. ఇవి అన్యములైనచో ఖేలనము చెడిపోయి, అధోగతిబడి, గుణహీనమైనట్లు తలంచనగును.

సంగీతము

ఇది నాటకమునకు శోభయని చాలమంది యభిప్రాయము కావచ్చును! అనగా నాటకమున పద్యములును శోభలనిచ్చు రంజకప్రధానములని తెలుచున్నది. కాని మీ రెన్ని చెప్పినను అస్వాభావికములని ఒప్పుకొనక తప్పదు. కవి హృదయమునకు బాగుండినందుననే ఒక రసస్థితిలో రచియించినాడు. అది యాతని ఆవేశము. శుద్ధముగ వస్తువును చూచు ప్రేక్షకుల కది యనవసరము. అవి లేకున్న శోభపోదు. ఉన్నందువల్ల లేని శోభ కలుగునాయని సందేహించుచున్నాను. "వాద్యములున్నవే? దేనికివి?" యంచురేని గీతముల నుపయోగింపుడు. పద్యమునకన్న గీతమునకే యెక్కువ వారసత్వములు కలవు. ఇట్టి హక్కులను గుర్తెరిగిన బ్రహ్మశ్రీ దైతా గోపాలముగారివంటి బుద్ధిమంతులు మనయందు చాల తక్కువ. ఈ హక్కులకు కొన్ని భుక్తములున్నవి. అయ్యవి అందరకు తెలిసిన సెలవులు.

సంగీతముగాని, పద్యముగాని నాటకముననుండకున్న నవి అశాస్త్రీయమనువాదము కలదు. అవి లేక రక్తియే లేదనువాదముకూడ కలదు. వీటి నిపుడు ప్రతిఘటించను. కాని రంగస్థల దౌర్భాగ్యతలు వదలువరకు పద్యరచన మానుడని ప్రార్థించుచున్నాను.

**సినీమాలు, టాకీలు, గ్రామ ఫోను శెట్టులు**

వీటి అగఘనములు కళకు కొంత దెబ్బతీసి, వన్నెతగ్గుటలు ఘటించినవనుటకు సంశయము లేదు. అందు గ్రామఫోనుమాట లటుంచి, మిగిలినవి మన నాటకకళకు దేశాంతర్గతులైన దాయాదులు. వాటివిషయమైకూడ యీపరిషత్తు శ్రద్ధతీసికొని తన కార్యక్రమములో నొక ముఖ్యాంశముగ పరిగణించి వలయు కార్యాలోచనము చేయవలసినది. నాటకకళకువలె దీనికిప్పటికి పతనదశలేదు. వేనునందు రాజ్యలక్ష్మి స్థిరించినట్లు, దీని కిది స్థిరించలేదు. తరణోపాయముల చింతనలేదు. వ్యూహమును బన్ను జోదులు కావలయును.

**నటులకు వలయు లక్షణములు**

ప్రస్తుతనటులయం దివి చాల లోటుబడినందుననే దీనినిగురించి చెప్పవలసివచ్చినది. శరీర పుష్టి, భాషాజ్ఞానము, స్ఫుటోచ్చారణశక్తి, ధారణాశక్తి, మనస్థైర్యము, శ్రావ్యకంఠము, ఓర్పు, సత్ప్రవర్తనము, లోకానుభవము ననునివి నటునకు వలయు లక్షణములుగా పెద్దలుచెప్పినారు. యథాశక్తి నాకు తోచినవి కూడ పొందుపరిచెదను:

1. ఎంత తెలిసినను అధినాయకుడనని యనుకొనక విద్యార్థిగనే జీవితమును గడపి "తెలివి యొకింతయేనియు" అను భర్తృహరిపద్యమును మూడువేళల పఠించుట వృద్ధికి నే చెప్పునౌషధము.

2. జంకుగొంకులు లేకుండ భటుడుమొదలు రాజువరకే వేషమైనను శ్రద్ధాభక్తులతో వేయవలెను. దీన నభినయము పక్వమగును, కుల్లిపోదు.

3. యుద్ధ ప్రణాళికలోని సైనికునివలె తన నిర్ణీతవిధి నెరవేర్పవలెను. తన ప్రక్కవారిని జంపి ఒక్కరుడే ధ్వజము నెత్తుకొని పోరాదు.

4. రంగస్థలమున తనతోడి నట్టువరాండ్ర "నమ్మా"యని నిండుగా సంబోధించు హృదయముల నలవరుచుకొనవలయును.

5. "సిగరెట్ల బీడీల పొగచుట్టల" అను పద్యమున యతికుదరక సురాపానమను పదమును కవి చేర్చలేదని గ్రహించిన, నచ్చపుబాగు గలదు.

రంగస్థలపు భావి అదృష్టములు వీరిచేతిలో నున్నవి. పరవశత, నిండు హృదయము, ఆవేశము మొదలగు మన సోదరులకుండు లక్షణములు ముఖ్యముగ తోడ్పడగలవు.

**తుదిమాటలు**

విషాదాంతములను గురించి ఒకకొంత శాస్త్రచర్చలకు లోనైన దీకళ. అనగా నవి స్వాభావికములు కావనియు, విదేశములనుండి రవాణాలనియు నూహాలు కలవు. ఒకమాట నడిగెదను. చావు తప్పక చివరరంగమున వచ్చిననే కాని కష్టాంతము గాదాయేమి ? కష్టాంతము మనశాస్త్రు మొప్పదాయేమి ? ఒప్పదు

కాబోలును! తుదకు సుఖాంతములైనను అంతవరకును నిజమైన కష్టాంతములకన్న నెక్కుడు విషాదభూయిష్ఠములగు హరిశ్చంద్ర, ఉత్తరరామచరిత్రాదినాటకములు లేవా? ఎంత అచ్చమైన సుఖాంతమందైనను, విషాద మొకకొంత లేదని చెప్పగలరా? మనదేశ రుచులకును, అదృష్టముల కును విషాదాంతము లొప్పినట్లు అన్యము లొప్పవు. ఈ Tragic land కు తప్ప మరేదేశమున కును Dignity of Tragedy తెలియదే? ఎందుకు వాదములు? మనము వ్యవహరించుకొను సుఖాంతములు చాల విషాదాతీత విషాదములు.

ఎవ్వరెప్పుడు చూడని నిజమైన ఖేలనము మహాత్ముని జీవిత నాటకమున చూచుటలేదా మనము? అదెంత విషాదపూరితము! సుఖాంతమే యగునని భారతీయవిశ్వాసము. కా దిప్పటికి పూర్ణించిన విషాదమేయని హూణులవిశ్వాసము. ఈపందెపు ఫలితములు చూచి నిర్ణయించు కొనుడు "విషాదాంతములా" "సుఖాంతములా" యని. దానితో తేలగలదు పరమేశ్వరుడు కష్టసుఖములకు కల్పించిన అవినాభావసంబంధము.

స్త్రీ సమస్య యొకటి యింకను బాధించుచున్నట్లు చవచవగా చప్పుడులు వినపడినవి. స్త్రీలు "వీడెవచ్చెగా గుంతీసుతమధ్యముండు" అనురీతి రంగమునకు దుమికినారు. సమస్య పూర్తిచేసినారు. చర్చలమానుడు. సోదరీమణు లింతమంది మనతో సమానముగా, కళారాధనకు పూనియుండగా ఏలనింక తటపటాయింపులు? వారు ముందుగాపోయి గర్భగుడిలో దేవికి హారతుల నిచ్చుచున్నారు. మీరు గంటలకొట్టుడు. అందరును సాష్టాంగపడుడు. ఆరాధనము ముగియునంత శాంతింతపెట్టుకొని మీనొసట నింతపూజాకుంకుమనుపెట్టగలరు. దాన శుభము కలదు.

# సమాలోచనము

## చతుర్థాంధ్ర నాటక కళాపరిషత్తు:

1. ఆదర్శ నాట్యరంగమును నిర్మించుట.
2. ఉత్తమము, ఆధునికము నగు నాటకమునకు బహుళాకృతి యొసగుట.
3. నాటక ఖేలనమును గురించిన శిక్షణ, అభ్యాసముల కవకాశము కల్పించుట.

అనుసీమూడును గతడిసెంబరు మాసమున చెన్నపురమున జరిగిన నాల్గవ ఆంధ్రనాటకకళాపరిషత్సభయందు దామోదింపబడిన తీర్మానములందు ముఖ్యతమములు. సభలు, చర్చలు, ప్రదర్శనములాదిగాగలవి యుత్సాహభరితములయ్యును పరిషత్తుయొక్క బాహ్యస్వరూపమును వ్యక్తముచేసినవి. పై మూడు తీర్మానములందిమిడియున్న నిర్మాణకార్యవిధానమే పరిషత్తుయొక్క ఆంతరంగిక ప్రవృత్తిని విశదముచేయుచున్నది. ఈతీర్మానములు మూడును రాగల వత్సరములం దెంతవరకు కార్యరూపమును దాల్చునో అంతవరకే పరిషదుద్యమము సఫలమైనటుల భావింపబడదగియున్నది.

## ఆదర్శ నాట్య మందిరము:

భారతదేశమంతట గాలించినను, మచ్చునకైన ఒక ఉత్తమనాటక ప్రదర్శనశాల లేదని హరీంద్రనాథుడు కొట్టుకొనుచుండెడివాడు. తెలుగుదేశమునం దొక్కటైనను ఆదర్శనాట్యమందిరమును నిర్మింపవలెనని పెక్కువత్సరములుగ మన రాఘవాచార్యులుగారు ప్రబోధముకావించుచునేయున్నారు. ప్రకృతమాంధ్రదేశమునందున్న నాటకప్రదర్శనశాల లన్నియును అక్కరమాలినవే యనుట నిర్వివాదము. నాట్యమందిరనిర్మాణమునందు పాశ్చాత్యదేశీయులను కొంతవరకు మన మనుసరించుట లాభకరము. ఈవిషయమున ఆచారముగాని, గ్రుడ్డిసంప్రదాయముగాని మనకర్తవ్యమున కడ్డుతగులరాదు. పాశ్చాత్యదేశములలోనెల్ల రుష్య, జర్మనీదేశములందలి థియేటరులు మిగుల నభివృద్ధిగాంచియున్నవి. మనవారు ఆదర్శనాట్యమందిరనిర్మాణమునకు గడంగుటకుపూర్వము మాస్కో, బెర్లిన్‌నగరములందలి ముఖ్యమైన థియేటరులనుగురించిన జ్ఞానమును బడయుటయు వాంఛనీయము. పరిషత్తువారొనర్చు ప్రయత్నములకు నటుల కలయిక, దేశీయుల ఆదరణలు ఆవశ్యకములు.

ఆ ధు ని క నా ట క ర చ న:

ఉత్తమమైన సాంఘికనాటకమునకు పరిషత్తువారు బహూకృతిని ప్రకటించిరి. తృతీయపరిషత్తునం దీనాటకరచనకై నిర్దేశింపబడిన నిబంధనావళి గ్రంథకర్తల స్వేచ్ఛ నతిక్రమించుచున్నదను శంక యుదయించుటచే, సదరునిబంధనలు రద్దుకావింపబడి వానిస్థానమున నాల్గవపరిషన్మహాసభవారు కొన్ని సూచనలను మాత్రము కావించియున్నారు. పరిషత్తువారి నిర్ణయమునకు గ్రంథముల సంపుట మత్సహించియు, నిబంధనల నేర్పరచినందుల కాక్షేపణకలనా రిపుడు నిరాటంకముగా పరిషత్తువారు నిర్ణయించిన గడువులోపుగా తమతమ గ్రంథముల నంపెదరని ఆశించుచున్నాము. ఆదర్శనాట్యమందిరము, ప్రయోగానుకూలమగు ఆధునికనాటకము ఈ రెండును సమకూరునేని ఆంధ్రనాటకరంగ మపూర్వశోభతో వెలయగలదు. ఆంధ్రనాటకకళయందు నూతనశకారంభ మగును.

ప్రా చ్య నృ త్య ము లు:

పరిషత్సభలసందర్భమున కూచిపూడివారి భామాకలాపము, శ్రీమతి శ్రీహరిభరతనాట్యము, విమలేందుబోసుగారి ప్రాచ్యనృత్యప్రదర్శనము లేర్పరుపబడెను. గడచిన యొకటిరెండుమాసములలో మేనకా, రాగిణీ, గోపీనాథులు, మలబారుకథాకళిప్రదర్శకులు, సింకీఉదయశంకరు లేతెంచి, తమతమ నాట్యప్రదర్శనములను కావించిరి. వీనియన్నింటిలోను శాస్త్రసంబద్ధము, సంప్రదాయసిద్ధముౖనైన నాట్యములు దక్షిణదేశీయుల (ఆంధ్రులు, అరవలు) భరతనాట్యమును, మలబారువారి కథాకళియునని చెప్పవచ్చును. సంగీతమునందువలె నాట్యమునందును అరవవారికిని, ఆంధ్రులకును ఒకేశాస్త్రము, ఒకేసంప్రదాయము. దక్షిణదేశీయుల నాట్యము లాస్యప్రధానము. ఇందలి సౌకుమార్యలాలిత్యము లసమానములు. 'లాస్యనృత్యము పురుషులచేకంటెను స్త్రీలచేతనే ప్రయోగింపబడదగియున్నది. కథాకళియందలి తాండవము పురుషోచితము. ఈ రెంటియొక్క సమ్మేళన మత్యంతహృదయంగమము కాకపోదు.

శ్రీ వేదాంతం రాఘవయ్యగారు:

గానకళయందు కీ. శే. రామసుబ్బయ్య, బాహుబలమునందు కోడి రామమూర్తి, చిత్రకళయందు దామెర్ల రామారావు, నాటకరంగమున రాఘవాచారి, నరసింహారావు లెటులో భరతనాట్యరంగమున ఆంధ్రులకు శ్రీ వేదాంతం రాఘవయ్య అట్టివాడు. నూనూగుమీసముల ప్రాయమువాడు. ప్రజ్ఞానిధి. ప్రతిభాశాలి. కాని ఈత డింకను మబ్బుచాటున మణగియున్నాడు. ఈతని

యశశ్చంద్రికలు నల్దిశలు ప్రాకుటకు దోహద మొసంగవలసిన భార మాంధ్రు లపై నున్నది. ఈ పెడు మన భామాకలాపములనే కాక కథాకళితీరులను, ఉదయశంకరుని శివతాండవతీరులనుగూడ గమనించి తనకళను నవ్యశోభతో నింపుట వాంఛనీయము.

మా వ్యాసకర్తలు:

"నాట్యకళ"కు ప్రాణబంధువులు వ్యాసకర్తలు. లోగడ ప్రథమ సంచికకువలెనే ఇపు డీద్వితీయమునకును వ్యాసముల నంపిన శ్రీ వేలూరివారు, శ్రీ మల్లాదివారు, శ్రీ తాడిపర్తివారు, శ్రీ గుఱ్ఱంవారు, శ్రీ ద్రోణంరాజు వారు ప్రాతస్మరణీయులు. "ప్రాతద మ్ముయ్యను జాబిల్లివలె" పనచెడనివారు. మా బాంధవ్యము నిరంతరాయముగా కొనసాగుగాక!

"సారంగధర" శకలము:

స్వర్గీయ, కళాప్రపూర్ణ వేదం వేంకటరాయ శాస్త్రిగారిచే సంకల్పింప బడిన సారంగధరనాటకరచన మాంధ్రజాతిదౌర్భాగ్యమునంజేసి అసంపూర్తిగనే నిలచిపోయెను. అట్లు వారిచే నసమగ్రముగా నుంచబడిన నాటకశకలమును వారి మనుమలును, మా యభిమానులలో నొకరునునగు శ్రీ వేదం వేంకట రామన్‌గారు మా కోరికను మన్నించి 'నాట్యకళ'యందు ప్రచురణమున కియ్యకొనిరి. శ్రీ శాస్త్రులవారి వైదుష్యమేగాక, రసజ్ఞత్వమును ఈ రెండు పుటలయందే అప్రతిమానముగ వెల్లడియగుచున్నది. ఇట్టి యపూర్వకావ్య మును లభింపజేసినందులకు శ్రీ వేంకటరామన్‌గారికి కృతజ్ఞులము.

ఏకాంక నాటకములు:

"సారంగధర" శకలముతో బాటు శ్రీ పా. వే. రాజమన్నారుగారి "మాతృప్రేమ", శ్రీ ద్రోణంరాజు చినకామేశ్వరరావుగారి "ఆత్మమరణము" అను ఏకాంకనాటకములను రెంటిని ప్రచురించియున్నాము. శ్రీ రాజమన్నారు గారిట్టి సాంఘికములను పెక్కింటి నీవరకే రచించి ప్రసిద్ధినందినవారు. వీరి రచనా వైదగ్ధ్యము, పాత్రౌచిత్యము, కథానువిధానపు పోకడలు హృద్యములు. కాని వీరు కల్పించిన పాత్రలు, పరిస్థితులు మన సాంఘికమునం దెంతవరకు సహజ ములు, యథార్థములునను విషయమై అభిప్రాయము లోకాటికిమించవచ్చును.

శ్రీ చినకామేశ్వరరావుగారి "ఆత్మమరణము" ప్రహసన మనదగిన ఏకాంకరూపకము. నాటకకర్తలుగా దేశమునకు వీరు నూతనులయ్యును ఈ

రచనయందు సిద్ధహస్తులుగా తెలియుచునేయున్నారు. వీరి నాటకము "గ్రైటిమాపనంట్" అను ఫ్రెంచినవలాకారుని A Family affair అనుకథ ననుసరించి వ్రాయబడినది. మన సంఘమునకును, మన భాషకును, సంప్రదాయమునకును అనుకూలములగు మార్పులు కొన్ని చేయబడినవి. మాతృక కంటెను ఎందునను ఏమాత్రమును తీసిపోకుంటయేకాక, నాటకమగుట మరింత మనోహరమైయున్నది.

ఇబ్ సన్ :

"నాట్యకళ" మొదటిసంచికయందు బ్రహ్మశ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారిచే రచింపబడిన "ఇబ్ సన్" అను వ్యాసమును ప్రకటించితిమి. సాంఘికనాటకనిర్మాతలలో ఇబ్ సన్ కవికి గల స్థాన మద్వితీయము. అందుచే ఆతని గురించియు, ఆతనికృతులనుగురించియు ఎంత తెలిసికొనిన మనకును, మన కళకును అంతప్రయోజనము. ఈవ్యాసమున శ్రీ రామానుజరావుగారు ఇబ్ సన్ రచనలనన్నిటను సంగ్రహముగా, విమర్శనాపూర్వకముగా చర్చించియున్నందున మరల నీవ్యాసమును ప్రచురించితిమి.

* * * * *

"నాట్యకళ"యందు కేవలము శాస్త్రమును, కళనుగూర్చిన సిద్ధాంత ప్రతిపాదనలేగాక నాటకప్రయోగము, రంగనిర్మాణము, పాత్రధారణము, అభినయాదికములనుగురించిన ప్రత్యేకవ్యాసము లెక్కువగా ప్రచురింపవలయునని మా హితచింతకులు కొందరు హెచ్చరించియున్నారు. మా యాశయమును అట్టిదే. ఈవిషయమైన విజ్ఞానమును దేశమున వ్యాప్తినందింపవలెనన్న పాశ్చాత్యుల గ్రంథములపై విశేషముగా నాధారపడకతప్పదు. ఆ గ్రంథములను సేకరించి వాని ననుసరించి ముమ్మొ దట్టివ్యాసములను ప్రచురింప యత్నించుచున్నాము. ఈవిషయమున ప్రత్యేకకృషిచేయునరింప నుత్సహించువారెల్లరు మాయుద్యమమునకు జేయూతనొసంగ ప్రార్థితులు.

మాశ్రేయోభిలాషులలో నొకరైన (మాలోనొకరే!) శ్రీ వేలూరి శివరామశాస్త్రిగా రంపిన లేఖయందలి సూచనలను కృతజ్ఞతతో నామోదించుచు, ఆలేఖ నిట వివరించుచున్నాము:

"శ్రీయుతులు నీలంరాజు వేంకటశేషయ్యగారు, చెన్నపురి.

మీ పత్రికమీద అభిమానంవుంచినందులకు నన్నభినందించారు. అభినందించడం ఎందుకు? ఆపత్రిక మీదే కాదు, మాదిన్నీ అందరిదిన్నీ.

ఈపత్రిక మూలమూలలకు పాకించాలని నాకు ఆశ. పాకాలి, పాకుతుంది. ఎందుకంటే అందరి విషయం సజీవం.

నాయీ కిందిఆశయాలు గమనించండి :

౧. పత్రికలో ముఖ్యములైన వ్యాసాలు ప్రామాణికాలు విజ్ఞులను కోరి వ్రాయించాలి. అట్టివి క్లాసికల్‌గా ఉండేవి ప్రతిపత్రికలోనూ మూడు నాలుగులోపల ఉండేట్టు ప్రయత్నించాలి.

౨. ప్రకృతం బయలుదేఱుతూన్న నాటకాలవిమర్శ విజ్ఞులచేత వ్రాయించాలి, వ్యక్తి దూషణ ఎంతమాత్రం తగులకుండా.

3. ఆడుతూన్న నాటకాలలో ఈడికఉండే ఘట్టాలున్నూ, అనభినేయాలున్నూ ప్రసిద్ధనటులచేత రాయించాలి.

౪. అనుభావములు, సాత్త్వికభావములు, (స్థాయిభావములు) నటులు ఎల్లా అభినయిస్తారో వారివారి అనుభవము వ్రాయింపించాలి. అది వ్రాయడానికి వీల్లేదని చాలామంది అంటారుగాని భరతుఁడు కొంత రాశాఁడు. చేతనైతే, అనఁగా డబ్బుఉంటే పోజులతోఁ గూడా ప్రసిద్ధనటుల అనుభావాదుల వైవిధ్యాలు ముద్రింపవచ్చునుగూడా. వైవిధ్యం అంటే ఒకే అనుభావం రాఘవాచార్యులుగారిదీ, నగరాజారావుగారిదీ, సుబ్బారావుగారిదీ ఇల్లాగే పలువురిదీ.

౫. నటులదూషణ ఇంచుకంతా ఉండగూడదు. (దూషణలవల్ల ఆంధ్రజాతి చస్తూంది.) వ్యక్తికి ఉపయోగించే విమర్శనకళ 'నాట్యకళ' స్వాధీనం చేసుకోవాలి.

నాకున్న తెలివితేటలలో 'నాట్యకళ'కు నేను సాయపడతాను, మఱచాను— ౬. నాటకాలలిస్టు ఒకటి తయారుచెయ్యాలి (ప్రహసనాది సర్వభేదాలతో సహా). ప్రతిసంచికలోనూ ప్రకృతం ముద్రితములయిన రూపకాల లిస్టుకూడా ప్రకటించాలి. గ్రంథకర్తలు పంపకున్నా, **Oriental Library** లోకి వచ్చితీరతవిగదా !

౭. ప్రాచ్యభాషలలోనూ, పాశ్చాత్యభాషలలోనూ వోగ్‌లోఉన్న నాటకాల భోగట్టా ఒకటి ఎప్పుడూ మఱువఁగూడదు.

మీకూ ఈవిషయాలన్నీ తెలిసేఉంటవి. మీయందున్నూ పత్రికయందున్నూ ఉండే అతిఅభిమానంచేత వ్రాయడమైనది పునశ్చ.

భవదీయుఁడు

వేలూరి శివరామశాస్త్రి."

# ఆంధ్ర నాటకకళాపరిషత్తు

## మద్రాసు

### నాటక బహూకృతి

(నాటకకర్తలకు సూచనలు)

1. బహూకృతికోసము పంపేనాటకము స్వతంత్రరచన కావలెను; అచ్చుపడిఉండ కూడదు; ప్రదర్శించి ఉండకూడదు.

2. ఈ సంవత్సరము బహూకరించవలసిన నాటకము సాంఘికముగా ఉండవలెను.

3. నాటకము ఇంచుమించుగా మూడుగంటలకాలములో ప్రదర్శించడానికి అనుకూలముగా ఉండవలెను.

4. నాటకములో ఎక్కువరంగాలు ఉండగూడదు. సాధ్యమైనంతవరకు పాత్రలు తక్కువగా ఉండవలెను; స్త్రీపాత్రలు మరీ తక్కువగా ఉండవలెను.

5. స్వగతములు, జనాంతికములు (asides) సాధ్యమైనంతవరకు ఉండకూడదు.

6. నాటకము వాడుకభాష (వ్యావహారికాంధ్రము)లో ఉండవలెను.

7. కథాశరీరము గద్యాత్మకమై ఉండవలెను.

బహూకృతినిర్ణాయకసంఘసభ్యులు ఎవరును బహూకృతికి తమ నాటకము పంపకూడదు.
బహూకృతికోసము నాటకకర్తల తరఫున ఎటువంటి ప్రచారమును జరగకూడదు.
బహూకృతివిషయములో నిర్ణాయకసంఘమువారి తీర్పు ఖాయము.

వచ్చినవాటకాలలో ఏదీ సంతృప్తిగా కనబడనప్పుడు బహూకృతి నిలిపివేయడానికి నిర్ణాయకసంఘమువారికి అధికారమున్నది.

బహూకృతి పొందిన నాటకప్రదర్శనము హక్కులూ, ప్రథమ ముద్రణాధికారమూ రెండుసంవత్సరములపాటు పరిషత్తువారికే ఉండును.

బహూకృతికి పంపేనాటకముతాలూకు మూడుప్రతులు 1935 వ సంవత్సరం ఆగష్టు 31 వ తేదీలోపుగా పరిషత్కార్యాలయానికి చేరవలెను.

నాటకము దళసరికాకితాలమీద ఒకవైపునే సిరాతో అక్షరాలువిడివిడిగా వ్రాయవలెను. పుస్తకములో ఎక్కడా నాటకకర్తపేరు వ్రాయకూడదు. పుస్తకముపేరు, నాటకకర్త పూర్తి చిరునామా సీలువేసిన కవరులో కార్యదర్శులకు పంపవలెను.

బహూకృతికి వచ్చిన నాటకాలలో ఏదైనా ప్రచురించడమునకు గాని, ప్రదర్శించడమునకు గాని పరిషత్తువారు ఆ గ్రంథకర్త సమ్మతిమీద పూనుకోవచ్చును.

---

**Printed at Lodhra Press & Published by N. V. Seshiah**
**at 7, Thambu Chetty St., G. T., Madras.**

# శంఖారావము

నేడు తెలుగునాటి సినిమాప్రపంచమును రెండుచిత్రములు ఆకర్షించుచున్నవి.

సీతాకల్యాణము!—లవ—కుశ!!

సీతాకల్యాణమునందలి

## రామతిలకము

కోకిలగానము ఆంధ్రకళాప్రియులను ముగ్ధులను జేసినది

లవకుశలోని సీతారామ పాత్రధారులగు

## శ్రీరంజని, సుబ్బారావు గార్ల

గానాభినయములు తెలుగుటాకీలకు క్రొత్త విలువదెచ్చినవి.

ఈ మూర్తిత్రయముతో, వేమూరి గగ్గయ్య మొదలగు మరికొందరు సుప్రసిద్ధనటీనటులతో మరొక తెలుగుటాకీ త్వరలో ఆంధ్రుల కధికతరానందము గలిగింప నేతెంచుచున్నది. అది ఏది?

వేల్ పిక్చర్సు వారి

# శ్రీకృష్ణలీలలు

మాస్టర్ రాజేశ్వరరావు



శ్రీకృష్ణ

అపూర్వ రంగాలంకారములతో నమర్చబడిన సెట్టింగులు—అద్భుతములైన వేషకల్పనములు—అబ్బురమొదవించు ఛాయాచిత్ర తంత్రములు—అభినవకథాసంవిధానము—వినూతనమధురతరసంగీతము—ఆధునిక సంగీతపరికరప్రయోగము—ప్రాచీన నాట్యప్రదర్శనములు.

***For booking apply to:—*** **VEL PICTURES Ltd.,**
**Distributing office: 4-95, Broadway, Madras.**

# బెజవాడ సరస్వతీ బుక్ డిపో

## స్వంత ప్రచురణములు

### ఆంధ్రదేశమందు ప్రదర్శింపబడు నాటకరత్నములు

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీ కృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 0 |
| బుద్ధిమతీ విలాసము డిటో | 1 | 0 |
| రంగూన్‌రౌడీ సో॥ రా॥ | 1 | 0 |
| ధరణికోట డిటో | 1 | 4 |
| సతీ అనసూయ డిటో | 1 | 0 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్తవిజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణం ము॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి శ్రీ॥ వ॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పత్నీప్రతాప్ అనసూయ సో॥ అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ ల॥ | 1 | 4 |
| జయంతజయపాలము ఆ॥స॥ | 0 | 12 |
| కృష్ణలీల బళ్ళారి కే॥ సు॥ | 1 | 4 |
| రామదాసు డి॥ గో॥ | 1 | 0 |
| రసపుత్రవిజయం ఇ॥ య॥ | 1 | 0 |
| రాణా ప్రతాప్‌సింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త నం॥ శి॥ | 1 | 0 |
| దుర్గాదాసు జం॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాపసింహ డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం॥ కే॥ | 0 | 12 |
| తులాభారం సాంగ్సు డిటో | 0 | 12 |
| చండీనాటకం ము॥ వే॥ | 1 | 0 |

### ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు

| | రు. | అ. |
|---|---|---|
| జానకీ శపథము | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము | 0 | 12 |
| మార్కండేయ చరిత్రము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| అంబరీష చరిత్రము | 0 | 8 |
| ప్రహ్లాద చరిత్రము | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 8 |
| భీష్మ చరిత్రము | 0 | 8 |
| పైన వుదహరించిన 8 పుస్తకములు కలసిన సంపుటము క్యాలికో బయిండు | 5 | 8 |

### బి. బాలాజీదాసుగారిచే రచియింపబడిన హరికథలు

| | రు. | అ. |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 |
| జయప్రదాదేవి చరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| రుక్మాంగదచరిత్రము | 0 | 8 |
| కుశలవ విజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| దయాకర విజయము | 0 | 8 |
| త్రైశంకు విజయము | 0 | 8 |
| సీతాకల్యాణము | 0 | 8 |
| ద్రౌపదీ మానసంరక్షణం | 0 | 6 |
| కుచేలోపాఖ్యానం | 0 | 6 |
| పురందరదాసు చరిత్ర | 0 | 6 |
| హరికథేతిహాసమంజరి పా 1 | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |

మావద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేటలాగు ఉచితముగా పంపబడును.

**కురుకూరి సుబ్బారావు,**

ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

5 రికార్డులు *




సీత:—శ్రీమతి శ్రీరంజని

లక్ష్మణుడు:—చొప్పల్లి సూర్యనారాయణ భాగవతార్.
లవుడు:—మాష్టరు రాజేశ్వరరావు.
కుశుడు:—సూర్యప్రకాశరావు (బాలభాగవతార్.)

త్వరలోనే విడుదల కానున్నవి.

## హచ్చిన్సు అండు కో

(రికార్డింగు శాఖ)

మౌంటురోడ్డు, మద్రాసు.

సినిమాప్రేక్షకులకు ! మరలనొక నయనోత్సవము !!

కలకత్తా ఈస్టుఇండియాఫిలిం కంపెనీవారిచేత సహజకంఠమాధుర్య
ప్రదర్శనావకాశముగల 'ఆర్.సి.ఏ.' ఫోటోఫోనుయంత్రముపై
మరల నొక ప్రసిద్ధ తెలుగుటాకీ తయారగుచున్నది !

# 'సతీ-అనసూయ'

డైరెక్టరు :
తెలుగుటాకీప్రపంచమున కలంకారములగు 'సావిత్రి'
'లవ-కుశ' టాకీలు డైరెక్టుచేసినవారు

## సి. పుల్లయ్యగారు

ఆదర్శపతివ్రతామతల్లియగు అనసూయాచరిత్రము అతిప్రశాంత
వాతావరణముతో, ప్రకృతిసిద్ధముగా తయారగుచున్నది!
త్వరలో వెలువడనున్నది.

---

వీరి రాబోవు టాకీ "సతీ - సులోచన" దానినిగూడ
సి. పుల్లయ్యగారే డైరెక్టు చేయనున్నారు

వివరములకు:

## చమరియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు

20, వేపేరి హైరోడ్డు,

పి. టి. మద్రాసు.




నాను

అమృతముకొరకు దేవదానవులు క్షీరాబ్ధిని అత్యంత ప్రయాసతో చిలికి శ్రమ పడినారు. చివరకు అమృతకలశము లభించినది. అమృతము జరయు, మృతియు లేని జీవనమును ప్రసాదించుటకు పేరుగన్నది.

సఖుడా,

• నేడు నీ వంతటివ్యయప్రయాసలకు లోనుగానవసరములేదు. ఇదే జరామరణములను దూరముచేయు శక్తినిచ్చే ఉష్ణరక్తము, కండరములు, నరములను పెంచగల అమృతము జీవామృతము నీకై సిద్ధముచేయబడినది. నీకు గల అలసట, నిస్సత్తువ, నీరసములను తొలగజేసి జీవనమును సుఖవంతము చేయగలది జీవామృతము.

# జీవామృతము

కండపుష్టికి, వీర్యవృద్ధికి, జవసత్వములకు

ఆయుర్వేదాశ్రమము, మదరాసు.

త్వరలో వచ్చుచున్నది అపూర్వ

# శ్రీ కృష్ణ

తెలుగు టాకీ త్వరలో వచ్చుచున్నది

# తులాభారము



కలకత్తా కాళీఫిలిం కంపెనీవారిచే ఆర్. సి. ఏ. ఫోటోఫోన్ యంత్రము మీద నవీన పద్ధతులతో అసమాన నటసమ్మేళనముతో తయారుకాబడిన భక్తిరసప్రధానమైన తెలుగుటాకీ.

ఆంధ్రతమిళరంగములందు నిరుపమానప్రఖ్యాతి గాంచి ఆంధ్రనటకుల కెంతయు నపూర్వ కీర్తిబడయజేసిన రంగమార్తాండ కపిలవాయి రామనాథశాస్త్రిగారు (నారద) మిస్. సభారంజని, మిస్. ఋష్యేంద్రమణి, మిస్. ప్రేమలత, మిస్. సీతారాం, మిస్. లక్ష్మి రాజ్యం, మిస్. కాంచనమాల, యస్. పి. లక్ష్మణస్వామి, యస్. జయసింగు, ఆంధ్ర ఛార్లీ చాప్లిను జోగినాథం వగయిరా ప్రముఖు లిందు పాల్గొనిరి.

తేదికై నిరీక్షింపుడు

ఈ నెలలో నెల్లూరు, బెజవాడ, తెనాలి, విశాఖపట్టణం, విజయనగరం, పట్టణములలో ప్రదర్శింపబడును.

*For booking apply to sole proprietor* :—**GUPTA & CO., M.S.R.A. GUPTA, Managing Director,**
**3/7, Thatha Muthiappan Street, G. T. MADRAS.**

